

శ్రీశుభమస్తు

కుమారస్వామి జననము అను

# తారకాసుర వధ

యక్షగానము

ఇయ్యది

జిలా మెదకు — తాలూకె నర్సాపూర్‌లో చేరిన

గుమ్మడిదాల గ్రామవాసులగు

నల్ల సాయన్నగారి పుత్రుండగు

రాజలింగముగారి ప్రోత్సాహమున

గ్రంథకర్త:

శ్రీయుత వైశ్యరత్న, చిదానంద

చెర్విరాల భాగయ్య గారిచే

రచియింపబడియె.



ప్రకాశకులు:

**కొండా శంకరయ్య**

సికింద్రాబాద్ - హైద్రాబాద్ & వరంగల్.

 1965 [వెల 0-75 న.పై.

# ఇందు వచ్చు పాత్రధారులు

—పురుషులు—

ఇంద్రుడు
మంత్రి
తారకాసురుడు
రాక్షసులు
బ్రహ్మదేవుడు
హిమవంతుడు
నారదుడు
శంకరుడు
మన్మథుడు
బ్రహ్మచారి
కుమారస్వామి

—స్త్రీలు—

శచీదేవి
మేనక
పార్వతి
రతీదేవి
చెలికత్తె



## హెచ్చరిక









శ్రీశుభమస్తు

కుమారస్వామి జననము

# తారకాసురవధ - యక్షగానము

శా॥ శ్రీకంఠుండు సురేంద్రవందితుడు ల ♦ క్ష్మీనాథమిత్రుండు నా
నాకంజాత భవాండరక్షకుడు జ్ఞా ♦ నానందదాయుండు గౌ
రీకాంతుండు సుధా శుభాళి సమ వ ♦ ర్తి ద్వేషి యెవ్వేళలన్
నాకల్యాంబు మదీయ వాంఛలెలమిన్ ♦ సాఫల్యముంజేయుతన్ ॥

సీ॥ కడుప్రేమతో నన్ను గని పెంచినట్టినా ♦ జనయిత్రిజనకుల సన్ను
తింతు ♦ వ్రాతలనేర్పిన వసుధ శైవాచారు ♦ డైనట్టి గురుబస్వయాఖ్యు
దలతు ♦ నతిప్రేమతోడ నన్నాశీర్వదించిన ♦ శంకరస్వామికే శరణు
జేతు ♦ చాదన్నునటుకొంత చదివించినట్టియా ♦ హనుమదాచార్యుల
నభినుతింతు ♦ పరిపూర్ణభావంబు పరగదెల్పినమాలె ♦ వుల్లయార్యుల
పాదముల భజింతు ॥ కాళిదాసాది సంస్కృత కవులదలతు ♦ భారతీ
యాంధ్రకవులను బ్రస్తుతింతు ♦ పరమభాగవతోత్తమ పండితులకు ♦
వందనంబాచరింతు నావాంఛదీర॥

వ॥ ఇట్లిష్టదేవతాభి వందనం బాచరించి - సకలసద్గురు పుంగవుల పాదపద్మంబు లెదలోస్మరించి నాయొనర్పంబూనిన కుమారస్వామి జననం బను తారకాసురవధ యక్షగానంబునకు కథాక్రమం బెట్టిదనిన.



—( గణపతివేషం రాకడ )—

క॥ శర్వాణీదేవి సూనుడ ♦ సర్వేందుముఖుండ విఘ్నపతినాముడ రా
గర్వవిరహితులకోర్కెలు ♦ నిర్విఘ్నముతోడనెపుడు నెరవేర్తునురా ॥

మాటలు॥ ఒరే ఒరే కైలాసాచల నివాసుండును సకలప్రమథగణ సేవితుండును డమరుత్రిశూల ధారుండును ధర్మాధర్మ విచక్షణుండగు కాలకంఠుండు మజ్జనకుండు కాత్యాయనీదేవి మజ్జనని నన్ను విఘ్నరాజని యందురు వారీ సూత్రధారీ.

దరువు – రూపకం.

శ్రీకాత్యాయని సూనుడ। సింధురయా పరిపూర్ణుడ । రాకసు ధాంశుముఖుండను । రాజీవదళాక్షుడరా ॥ శ్రీ ॥ మూషక వాహనుడను స । న్మౌనిజనసేవితుండనురా । భాషాపతి వంద్యుడ స । ద్భక్తజనా వనుడనురా ॥ శ్రీ ॥ లంబోదరుడను సుగుణాలంకృత శుభకరుడనుగా । జంభారివిభవుడను హే । రంబుడ సుచరితుడరా ॥ శ్రీ ॥ ధరణీ గుమ్మడి దాల । పురమందున వెలసితిరా । వారువద సరసీరుహముల । విరతము మది గొల్చెదరా ॥శ్రీ॥

సం–వ॥ అని యిటులవచించి వినాయకుండు వెడలిపోయినంతలో,



—( సరస్వతీదేవి రాకడ )—

కం॥ నీరజగర్భుని రాణిని ♦ ధారుణివిద్యలలో వెలయు దానను వినవే
కోరికతో నరుదెంచితి ♦ భారతినాపేరువినవె పద్మదళాక్షీ ।

మాటలు॥ సత్యలోకాధీశుండును సమస్త జగజ్జంతుజాల నిర్మాణ చాతుర్య ధురీణుండును త్రిమూర్తులలో శ్రేష్ఠుండును చతుర్ముఖుండగు బ్రహ్మదేవుని పట్టంపురాణిని సకలవిద్యలకాధారిని యన్నాంబు సరస్వతీ దేవియందురు చానా మందయానా.

దరువు – ఆట.

వనజనేత్రిరో నను సరస్వతీ। యనుచు బిల్తూరూ । యనుచు బిల్తూరూ । అనుదినము గొల్తూరూ ॥ వ ॥ భూరివిద్యలలోన వెలసిన

భారతిని నేనూ । భారతిని నేనూ । వేసారకనుపేమా ॥వ॥ మేటిలో శ్రీగారి లక్ష్మియు । సాటిరారమ్మా । సాటిరారమ్మా । నాతోటి విన వమ్మా ॥ వ ॥ ధాత్రి గుమ్మడిదాల పౌత్రి । నేతురినీ దలతూ । తిరినే తురినీ దలతూ । సుచరితురిడని గొలతూ ॥ వ ॥



—( శచీదేవి రాకడ )—

కం॥ శ్రీవిలసిత గాత్రిని నే । దేవేంద్రుని సతిని మిగుల ధీశాలిని బల్
 ఠీవి జెలంగగ వస్తిటు । మా వైభవ మెన్న తరమె మంజులవాణీ ॥

మాటలు॥ అమరావతీ పట్టణంబును పరిపాలించువాడును అతుల వైభవోపేతుండును సకలదేవతలకు ప్రభుండును సన్మునివినుతుండును గరుడగంధర్వ యక్షకిన్నరకింపురుష సిద్ధసాధ్యోరగ సేవితుండును అగు దేవేంద్రుండు మన్నాథుండు నన్ను శచీదేవియందురు సఖి చంద్రముఖీ.

దర్వు - ఏక.

భావజుసతిశత ఠీవిజెలగు శచీ । దేవిని నానామమువినవే । దేవేంద్రుని సతినై వెలుగొందితి । సావధానముగ నను గనవే ॥ భా ॥ యిందుముఖిని బలుసుందరగాత్రిని । మంద వంద గమనను నే వినవే । చందన గం

ధిని । సచ్చరితను సఖి । బృందమునను గొల్తురుగనవే । భా । గరుడో రగ కిన్నర గంధర్వుల । కాంతలు నను సేవించెదరే । సురకాంతలు సుస్థిరమతితోడను । పరిచర్యలు జేతురుగనవే । భా । ధారుణిగుమ్మడి దాల నిలయుడౌ । మారసంహారుని దలచెదనే । నారెకుమది వేసారక నెప్పుడు । కోర్కెలొసగగ గొలిచెదనే । భా ।

చెలి-క । ఈకథజెప్పించిన సు । శ్లోకుని నామంబదేమొ సుకవి యెవరో కా । మాకేర్పరింప గోరితి । ప్రాకటముగ జనులు వినగ బలు కుము తల్లీ ।

శ-వ । చెలీ అటులే వచించెదను వినుము.

## సీసమాలిక

శ్రీకరంబైనట్టి జిల్లామెదక్ లోన । తాలూక నర్సాపూర్ దాన వెలయు । మేలైన గుమ్మడిదాల గ్రామంబొప్పు । నా గ్రామవాసుండు నయగుణుండు । ఘనత కెక్కినయట్టి కౌండిన్యసద్గోత్రి । జనితుండు నల్ల వంశాబ్ధివిధుడు । సాయన్న నాముండు సద్గుణుండాతని । సతులిద్దరును మహా సాధ్వీమణులు । భాగమ్మ సాయమ్మ నాగజెల్లునయందు । సాయమ్మ తనయులు శాంతియుతులు । రామయ్య లింగయ్య నామంబు గలవారు । భాగమ్మతనయుండు భవ్యగుణుండు । రాజలింగంబన రాజిల్లె భువియందు । వీరలు సత్కీర్తి గోరిమదిని । సప్తసంతానములకృతి శాశ్వతమని । శర్వానిభక్తుడైనట్టి చెర్విరాల । భాగయాఖ్యుని బిలి పించి బహుమతులను । యిచ్చి యీకృతి జేయించి రింపుగాను ।

వ । కావున.

కం । కృతిజేయించిన వారికి । కృతిజేయగ ప్రోత్సహించు కృత మతులకునీ । కృతిజేసిన సత్కవికిని । కృతిపతి శుభముల నొసంగు కృతకృత్యుండై ।

చె-వ । అమ్మా అటులైన మహాసంతోషమేకాని యింకా నీకథ యెటువంటిదో వినంజేయుము,

శ-వ । చెలీ అలాగే విన్నవించెదను వినుము,

శచీ - దర్వు - ఆది.

మరాళగమనను సరోజాక్షినే । పురందరుని సతినీ । పూర్ణసా గరాకీర్తిమతినీ । భూరివి । స్వరా సుగుణవతినీ । వినగదే ॥మ॥ ధృతీయందు పార్వతీ లక్ష్మి భారతీ సాటిరాయా । నాదు స । న్నుతీ మరువబోరయా । జగతియే । సతీనాదుతీరయా । లేనుగదె ॥మ॥ తులలేని వైభవంబుచేనే । మెలంగుచూనుందూ । సురభిన । చెల్వలూలు మది యందూ । తరుచునా । చెలిమివిడకుందూ । నెవుడుగదె ॥మ॥ ధరణ్ సుమ్మడిదలపుర్ణ్ వెయు స్మరహరూపసేదలను । మదినిను । స్థిరంబుగా గొలతూ । విపుల శుభకరంబునే వలతూ । వినగదే ॥మ॥

సం-వ॥ అని వచించి శచీదేవి అంతఃపురంబునకు వెడలిపోయి వంతలో.



—( మాతలియను ప్రధాని రాకడ )—

దర్వు - ఆది.

ఇంద్రదేవకీ సవారినికలే । యేక్యా బల్యామచాయేహై । చంద్రిసూర్య సమతేజఝులకతే । స్వర్గలోక సే ఆతేహై ॥ఇం॥ హాతీ ఘోడా ఊంటపాలకీ । హాజ్యారో సైనిక్ సాథ్‌హై । తెత్తీస్‌కరోడ దేవ ఔర్ మునీ । దిక్పాలక్ కహాలాతేహై ॥ఇం॥ రంభా ఊర్వశీ ఔర్

మేనకా । రాగరంగ సే గా తేహై । తుంబీహంబీ మత్ కహాంసబ్ కో । జంభారీమత్ వాలాహై ।౩॥ దేవీయిందాణి మన్‌హారా । హావభావతో ఖూబీహై । సావధానసే గుమ్మడిబాల । శంకర్‌జీకో భజతేహై ।౪॥

## మంత్రిమాటలు హాస్యగానితో

మం॥ అరేమియా యే క్యాగడ్‌బడ్ మచాయేహై

హా॥ మహారాజ్ యహాపర్ భాగవత్ ఖేల్‌రహేహై

మం॥ అరే బేవకూబ్ అచ్ఛాబోలో

హా॥ నాటక్ ఖేల్ రహేహై నాటక్ అబ్ ఆప్కే సమజ్‌మే ఆయాహైనా.

మం॥ అచ్ఛా క్యా నాటక్ ఖేల్ రహేహై

హా॥ ఇస్ నాటక్ కో తారకాసురవధ కహతేహై

మం॥ బహుత్ అచ్ఛాహై లేకిన్ యిస్ నాటక్ కో కౌన్‌బన్వాయాహై.

హా॥ గుమ్మడిదల్ కే రహనేవాలా నల్లసాయన్నాకా బేటా రాజలింగం ముస్తాజర్ సాహబ్ నే బన్వాయాహై.

మం॥ అచ్ఛా యిస్ నాటక్ కో కౌన్ బనాయాహై

హా॥ చెర్విరాల భాగయ్యా షాహిర్ నే బనాయాహై.

మం॥ బహుత్ ఖుషికీ బాత్‌హై లేకిన్ యహాపర్ యింద్రదేవకీ సవారీ అనేవాలీహై హై పేష్కార్ తాహూ ఆప్‌లోగోనే తమాం కార్‌గుజారీమే హుషియారీసే రహనా ఖబర్‌దార్.

హా॥ అజీ మహారాజ్ ఆప్ కౌన్‌హై ఆప్కా నామ్ క్యాహై ఆప్‌కా వతన్ కౌన్‌సాహైకీ యిస్ సభాజనోంకో మేహార్‌బానీ కర్కే జరాసునాయ్యే.

మం॥ అచ్ఛా వహీసాహీ కహూంగా సునో.

## మంత్రి - దర్వు - అది.

పాకశాసను మంత్రివర్యుడా । త్రి । లోకవంద్యుడ ధీవరేణ్యుడా । భీకరాకారుడ భీతిచింతయును లేక । సోకుమూకలబట్టి స్రుక్కడం

చినవాడ ॥ పా ॥ మారకోటి దివ్యతేజుడా । యస । మానసజ్జన కల్ప భూజుడా । భూరివిక్రముడాను భుజబలశౌర్యుడ । మేరుధీరుడాను మేటి వైభవుడాను ॥ పా ॥ భాసురాంగుడ మధురభాషుడా । దర । హాస హస్తుడ రత్నభూషుడా । వాసిగనిరతంబు వాసవునాజ్ఞతో । గాసిల్ల జేసెద కఠినచిత్తులబట్టి ॥ పా ॥ ధరణి గుమ్మడిదాలవాసునీ । గంగా । ధరునీ సద్భక్తపాలానునీ । వరుసతో నాయొక్క వాంఛలు నెరవేర । స్మరియించు చుందు సుస్థిరమానసుడనయ్యి ॥ పా ॥



—( దేవేంద్రుడు రాకడ )—

కం॥ దేవవిభుండను వినరా । భావజసమసుందరుండ బాహుబలుండన్ శ్రీవిలసిత వైభవుడను । దేవేంద్రుడటండ్రు నన్ను దిక్పాలుడరా ॥

మాటలు॥ ఒరే ఒరే అపరవిక్రమ పరాక్రమోపేతుండను అరి వీర భయంకరుండను నవమన్మథాకారుండను కశ్యపబ్రహ్మ కుమారుం డను స్వర్గలోకాధీశుండను మన్నామంబు దేవేంద్రుడను యందురు దూతా వినయ విఖ్యాత.

దర్వు – రూపకం

దేవాధిపుడను నేకచీ । దేవి మనోహరుడనురా । దే ॥ కేవల కీర్తిమంతుండని । భావింతురు । సేవింతురు । దేవముసీశ్వరు లెల్లరు । దే॥

మారకతోద్దీపిత సుకు । మార శరీగుండనురా ॥ పోరువవైరులబట్టిస । నారతమును । ధీరతతోఁ । వారకమ్రించినవాడను ॥ దే ॥ ధీలోలుడనే సద్గుణ । శీలుడ దిక్పాలుడరా ॥ శ్రీలోలుని సోదరుడను । మేలుగ । సేలుగ । విభవ శ్రీలచె నొప్పెటివాడను ॥ దే ॥ ధరణిలో వెలసిన గుమ్మడి దాలపురీ నిలయుడరా ॥ కరుణాకరుడౌ శంభుని । స్మరియించెద । గురి నిల్పెద ॥ కరుణించుమటంచునునే ॥ దే ॥

వ॥ మంత్రీ మాతలి.

మం-వ॥ స్వామీ యేమిసెలవు.

దేవేం -సభ జేయుట - దర్వు.

ఇం॥ మాతలి నేడూసభ । జేతను వేడూకతో ॥ మా॥ ప్రీతితో సురమానులందరి । బిల్వనంపుము నీక్షణంబున । భీతిచే పగవారి గుం డెలు । బిట్టుబెదరియు పారిపోవగ ॥ మా॥

మం॥ మీరువచించిన । తీరుగ సురలందరు ॥ మీ॥ కోరికలరగ మీదుసన్నిధి । జేరవచ్చుచు నుండిరదుగో । పారవార గంభీరముగ నుని చాగతప్రరులయ్యె వేడుక ॥ మీ ॥

ఇం॥ గాయకవర్యుల । కవిపండితుల ॥ గా ॥పామకను రప్పిం చుమిచటికి ॥ న్యాయమార్గ విచార పరులను । ధీయుతుల సుజ్ఞానులనుజే । గీయమానంబొప్పగాను ॥ మా ॥

మం॥ సురవర మీయానతి । సరసకవీశ్వరులు ॥ స ॥ మరియు పండితులాదిగాగల । మహాజనంబులు వచ్చియుండిరి । వరుసతో వివ రించు నింకె । వ్వరిని బిల్వగ వలెనొ వేగమె ॥ మీ ॥

ఇం॥ వారావనితలను । కోరిక బిల్చియును ॥ వా ॥ సారెకును సభ వారుమెచ్చగ । మీరినాట్యము జేయుసెలవిడు । ధారుణీకూష్మాండ పౌరి । మారి వైరిని మదిని దలచియు ॥ మా ॥

గీ॥ సుమనసులకెల్ల నెట్టి కష్టములు లేక ♦ చల్లగానుండిరే మాను లెల్ల వేళ ♦ దానవులబారి బడకను తామునర్చు ♦ పనులు నెరవేరు చుండెనాపలుకుమంత్రీ ॥

మం-వ॥ ప్రభో తామప్రమత్తులై మెలగుటచేత త్రిజగవాసుల కేవిధమైన కష్టములులేక సుఖంబుగానే యున్నవారలు.

ఇం_చే! అటులైన ధన్యుడను నేటికీ సభను చాలించి అంతః పురంబు కేగువాడను.

స_వ! అనివచించి యిందు్రిడు వెడలిపోవుటయునంత.



-( తారకాసురుడు రాకడ )-

క౦! దానవ కులనిధి చంద్రుడ। మానధనుడ వైరివీర మర్ద నుడ నురా। మానశేనుందరుండను। కానుమి నాపేరు తార కాసురుడనురా।

మాటలు! ఒరే ఓరే మదీయ గదా దండంబున అరివీర మస్తకం బుల తాళఫలంబులవలె దుల్లజేసిన మల్లుండను దైత్యకులా భరణుండను నముచి కుమారుండను మన్నామంబు తారకాసురుడందురు సారథీ గుణ వారధీ.

దరువు-గత్తు.

దానవకుల చంద్రుడాను। జ్ఞాన సుగుణ సాంద్రుడా। దీనజనా వనుడరానే। మానక సురలాను మదమణగించెద।దా। నముచిత్రియ సుతుండరానే। విమల చరిత్రుండరా। సుమశర సమ తేజుడరా। క్రమమూతో దనుజాల కాపాడుచుండెద।దా। భూరివిక్రముండరానే।

భుజబల శౌర్యుండరా । మేరుగోత్ర ధీరుడరా । సారెకుకూష్మాండ పారీ మందిరు దల్తు ॥ దా ॥

తా_వ॥ మంత్రీ ధూమ్రమాతా.

మం_వ॥ కింభో రాజప్రదీపా.

తా-వ॥ మంత్రి మనదానవులకు క్షేమమేకదా. నా వైరి వర్గంబులో ముఖ్యులగు దేవతలు నన్నుంగూర్చి నా ప్రతాపమును గూర్చి యెట్లు ప్రశంసించుచుండిరో విన్నవించుము.

మం-వ॥ ప్రభో.

సీ॥ తలలెత్తి తిరుగ రింద్రాది దేవతలెల్ల । వడగ లెత్తకనుండు వన్నెలును । భానుసూనుడు కాలపాశంబు బట్టడు । వరుణుండు వర్షము గురియకుండు । ననిలుండు చల్లదనంబున దిరుగాడు । పవనుండు యిటు యిసుమంత వన్నెగొనరు । హరియు హరుడును బ్రహ్మయు వరుసగాను సృష్టి స్థితిలయకార్యముల్ నష్టపరచి । యున్నవారలు మీమహిమెన్న తరమె । సురవిరాకార తారకాసుర వేరణ్య ॥

తా-వ॥ శభాస్ మంత్రీ శభాస్ కాని నొక తాపము నా హృదయమును దగ్ధపరచుచున్నది. నేనేమిసేయుదును.

మం-వ॥ ప్రభో స్వర్గ మర్త్య పాతాళవాసుల నొక్క పెట్టున హరిగొన జాలినంతటి వాడవయ్యుండి కూడ నిటుల విచార పడుటకు హేతువేమొ తెలియకుండెను దయజేసి కాస్త విన్నవించుడు ప్రభో.

వాదం - దర్వు - అది.

తా॥ వినరా వో మంత్రి శేఖరా । నేనేమని నీతో । వినిపింతూ శత్రు భీకరా । మునువృత్రుండను దనుజేంద్రునికడ । ఘనమంత్రిగ నా । జనకుడుండెరా ॥వి॥

మం॥ వలనొప్ప విన్నవాడనూ । వృత్రాసుర సంగతి । బలుశౌర్య ప్రతాపుడు నూడనూ । ఖలుడే యింద్రుడు ఘాతజేసెనని తెలిసి కొంటి పెద్దలు బల్కంగను ॥వ॥

తా॥ అట్టి రణరంగా మందునా । నాజనకుని యింద్రుడు । పట్టి వధియించే గావునా । గట్టిగ నముచికి గన్న కొడుకునై పుట్టి తండ్రి రుణ [illegible] ॥ అ ॥

మం॥ అంతపనివాడా జేసినా । మీాజనకునటుల బల । వంతంబు తోడ జంపెనా । యెంతకైన యాయింద్రుని బట్టియు । వంతుళాపి నీవైరము దీర్చుకో ॥అం॥

తా॥ బ్రతికుండీ ఫలమూ లేదురా । సురనాథునిబట్టి । వాత మార్చకుండా విడువరా । శతి పురంధ్రి నటు జరజర నీడ్చియు । మతి దీరగ నేరతి సల్పెదరా ॥బ్రి॥

మం॥ నీవూ దలచీన పిమ్మటా । నెరవేరనిదెయ్యది । దేవేంద్రు డేమీా లెక్కటా ॥ కావున నిప్పుడె కదలి స్వర్గముకు । పోవలె నిక్కము పురుషార్థంబున ॥నీ॥

తా॥ సరేరా మనసైన్యమంతయూ । పోగొనరించుమి నీ । వర మరజూడకు మింతయూ । ధరణి గుమ్మడిదాలలో వెలసిన । పరమేశుడె మనపంతము దీర్చును ॥స॥

వ॥ ఒరే నీ విప్పుడే మనసైనికులనెల్లను తయారుజేయుము.

సుం-వ॥ ప్రభో మీారన్నంతమాత్రమున మన రాక్షస భటులెల్లరు గదా తోమర బిండివాలాద్యాయుధంబుల దాల్చి మహా కోలాహలంబున వచ్చుచున్నవారలు గాంచుడు.





రాక్షసులు శాకడ దర్వు - ఆది.

మేమెదండి దైత్యులం । మేటిభుజపరాక్రిలం । నామభేదదండనముల సాటిలేని వారలం ॥ మే । యింద్రునైన గొబ్బిడం [illegible]

బట్టెదం । చంద్రసూర్యుల నట్టెదం శౌర్యములను జూపెదం ॥ మే ॥ శక్తిచేత బట్టెదం మత్తుగోలి తిరిగెదం । చిత్తమొచ్చినట్లు వైరుల కుత్తుకలను గోసెదం ॥ మే ॥ తారకాసుర బంటులం భూరి కీర్తిశాలులం । యేరికైన వెరువనట్టి । ధీరవీర శూరులం ॥ మే ॥ కరుణలేని వారమూ । పరులమేలు కోర్వము । ధరణి గుమ్మడిదాలవారి । ధవళ గాత్రుని దల్తుమూ ॥ మే ॥

సం-వ॥ ఇటు లరుదెంచి రాక్షసులు తారకాసురునితో నేమను చున్నారన,

రాక్ష-క॥ వందనము దైత్యవల్లభ । వందనమిదె నముచిపుత్ర వైరివిదళితా । వందనము మమ్ము త్రిప్పచటికి । నెందుకు బిలిపించినావో యెరిగింపుడిక ॥

తా-వ॥ దనుజులారా సురల కండకావరం బడంచుటకును నాతండ్రియొక్క పగదీర్చుకొనుటకును మన దైత్యులకెల్లరకు మేలుగూర్చుటకు స్వర్గముపై దండయాత్రసల్పుటకు మిమ్ములను రావించితిని యేమని యెదరో తెల్పుడు.

రా-వ॥ ప్రభో మీయాజ్ఞను శిరసావహించి అటులే వచ్చెదము,

తా-వ॥ శభాష్ మిత్రులారా,

తార - దర్వు - ఆది.

వెడలుడి వెడలుడి యమరులపై । పిడుగులవలె బడిపోరుటకై । జడియకుడిక మన జవతో స్వర్గము । కడువడి నేడె గైకొనవలయును ॥ వె ॥ పాకశాసనుని బట్టుడిక । బాగుగ చెరలో బెట్టుడిక । భీకరముగ యా నాకపురంబును । చీకాకుపరచి చెడగొట్టుడింక ॥ వె ॥ కిన్నరులను వడదన్నుడిక । పన్నగులను బట్టీడ్చుడిక । వన్నెచెదర గొట్టుడి గంధర్వుల । కన్నెల జెరచియు కష్టపెట్టుడీ ॥ వె ॥ సిద్ధుల నేడ్వగ బట్టుడిక । సాధ్యులనదపై గొట్టుడిక । తద్దయుగుమ్మడిదాల శంకరుడు । పద్దని యుద్ధము వచ్చిన విడువక ॥ వె ॥

వ॥ ఒరే కాసరాక్షా ధూమ్రాక్షా బిడాలోమా మీరు మీ సైన్యంబులతో స్వర్గలోకము నంతయు నల్లకల్లోలమును గావింపుడు నే నిప్పుడే యా యింద్రుని బంధించి వానిభార్య నీడ్చుకొని వచ్చెదను.

సం-వ॥ అని తారకాసురుడు స్వర్గముపై దండెత్తి వచ్చుటంగాంచి శచీదేవి యింద్రునితో నేమనుచున్నదన,

గీ॥ అదుగో ప్రాణేశ చూడుడీ యసురులంత । మిగులకోలాహాలంబుతో మిట్టిపడుచు । కదలివచ్చిరి స్వర్గలోకంబునకు । యెట్లు సేతము మనకింక నేదిదిక్కు ॥

ఇం-వ॥ ఔను ప్రాణేశ్వరీ భయపడకుము తారకాసురుండను దానవాధముడు నన్ను నోడించుటకై పంతంబు బూని యిట్లరుదెంచు చున్నవాడు నేనిప్పుడేపోయి వాని హతమార్చివచ్చెదను సెలవొసంగుము,

వాదం - దర్వు - ఆది.

శ॥ విను ప్రాణనాయకా । యుద్ధంబుసేయ నవలదు వలదు ॥వి॥ వనజసంభవుని వరములచే యా । దనుజుడు బలిసియుచాలా । సుర । ముచులనొంచ నీలీలా । మన । మున దలంచి నివ్వేళా । జనుదెంచె చూడు । స్వర్గముకు కీడు ॥వి॥

ఇ॥ కాంతాలలామరో । చింతింపనేల నీస్వాంతమందు । కాం । యెంతపాటి బలవంతుడో దైత్యుని । వంతుబాపెదనుచూడు । ర । వ్యంత లోన వినునేడు । దావంతమెల్ల నికవీడు । నామాటనమ్మి । నాశాజ్ఞ నిమ్మి ॥కాం॥

శ॥ పోనివ్వ జాలనూ । యా దానవుండు బహుదండివాడు ॥పో॥ మానుమియుద్ధము మదిలోదలపకు । జ్ఞానసాగరుడవీవూ । అను । మానమొంద కున్నావు । అవ । మానమొందెదవు లావూ । నామాట వినుము । నను ప్రేమగనుము ॥పో॥

ఇం॥ పురుషార్థ ముండియూ । పోకుండు టొప్పునటె పువ్వుబోడి । పు॥ దురుమార్గుండా దానవునిప్పుడె । నురుమాడెద నేనూ । యిటు । వెరపొందుట మానూ । సు । స్థిరచిత్తము బూనా । నాబలముజూడు । నళినాక్షీనేడు ॥పు॥

శ॥ వలదన్నమీరలూ । బలిమీకి యుద్ధముకు పైనమాట ॥వ॥ యులలో గుమ్మడిదాల పోరియా । జలజాక్షుని సఖుడూ । మిము । వల నొప్పగ నెపుడూ । ని । శ్చలచిత్తుడు శివుడూ । కాపాడుగాక । శప ముల నిడక ॥వ॥

వ॥ ప్రాణేశ్వరా అటులైన త్వరగానేగి విజయముగాంచి రండు.

సం-వ॥ అనిన దేవేంద్రుండు వజ్రాయుధంబు కేలంబూని తారకాసురుని సన్నిధికరుదెంచి యేమనుచున్నాడన.

ఇం-ఉ॥ ఓరిదురాత్మ నీవిటకు ♦ నొప్పను మెప్పను లేకవచ్చి యీ
తీరుగ నాకలోకమును ♦ తెర్లొనరింపగ బూనియున్న యో
క్రూరమదీయ వజ్రమున ♦ క్రొవ్వడగించియు దేవతాళికిన్
భూరి సుఖంబు గూర్చెదను ♦ పోరుననిల్వుము పారిపోకు రా ।

తార - సుగంధి వృత్తము.

పారిపోవు వాడగాను ♦ పాకశాసనానినున్
పోరులో వధించవస్తి ♦ భూరివిక్రముండనై
రార నీ శిరంబు నేల ♦ రాల జేతునిప్పుడే
జారచోర వృత్తులెల్ల ♦ సాగవింక నాయెడన్ ।

వాదం - దర్వు - గత్తు.

ఇం॥ ఓరి తారకాసురా । యిటు జేరవస్తి వేలరా । పారిపోక లేనియెడల । భూరి ఖడ్గంబూన । ధారుణి కూరగింతు ।ఓ॥

తా॥ పారిపోవు వాడనా । నీ । ప్రాణములను దీయనా । ఓరి యింద్ర నిన్నుబట్టి । ఘోరఖడ్గంబూన । జీరివేసెదచూడు ।పా॥

ఇం॥ అంతటి ధీరుండవా । భయమింతలేక బోరెవా । యెంతటి వాడౌరనిన్ను । వంతుబాపి సురల సంతోష పరచెద ।అం॥

తా॥ దిగులుకేంద బోనురా । నా । మగటిమి జూపి తురా । అగణితముగ నీదుగొంతు । తెగటార్చిజనకూని పగదీర్చుకొనియెద ।ది॥

ఇం॥ వేయుమాటలేలరా । వజ్రాయుధమిదె చూడరా । పాయ కుండవైచితినీ । కాయంబు తునియలుగా జేయు నిప్పుడె ।వే॥

తా॥ నీయదెంత ధాటిరా వజ్రాయుధమేపాటిరా । రోయక నిను ద్రుంతుచూడు । పాయక కుష్మాండపోరి వాసుడుమెచ్చ ।

తార - పంచచామరము.

సరాసరిన్ భయంకరాస్త్ర శస్త్రముల్ ధరించితిన్
సురేంద్ర నీకు రంబుసాటి జూచినాట వైచితిన్
హరీ హరాదులెల్లనీదు యుద్ధమయ్యు నిల్చినన్
వెరంగుజెందబోనురా వివేకహీన తాళుకో ।

వేంచేసియుండె నేనేమిసేతు । వానికంటను బడకుండ పారిపోయి । యుండుటే మంచిదనిపించె యొప్పగాను ।

సం—వ॥ అని శచీదేవి పారిపోవుచున్నంతలో తారకాసురుం డెదురు జని యేమనుచున్నాడన.

తా—వ॥ మనోహరీ యెక్కడికేగుచుంటివి నిలువుము.

శ—వ ఛీ దుర్మార్గా ఆవల దొలగిపొమ్ము.

వాదం – దర్వు – ఏక.

తా॥ వినవె శచీ నీకొరకై । వేంచేసితి నింతవరకు । వేం॥ మనమున భీతిల్లి నాతో మాటాడక పోవుటెందుకు ॥ మా ॥

శ॥ పోరపోర నీచాత్మా । పొగరుమాటలు బల్కబోకూ ॥పా॥ నారహీన వొంటిగున్నా । నారిని ననుజేర రాకూ ॥ నా ॥

తా॥ సారహీనుడను గానూ । నారనాక్షీ వినవె సఖి ॥ సా ॥ దూర బార మెంచకనను । జేరరమ్ము చంద్రముఖి ॥ జే ॥

శ॥ వొంటిగ పరస్త్రీలజూచీ । వెంటదవిలి పలుకుటేలా ॥ వెం ॥ వింటివా విను నాదు మాట । వినకయున్న చెడెవుచాలా ॥ వి ॥

తా॥ మానిని నినుజూడగానే । మరు తాపము గలిగె నాకూ ॥మ॥ దానరో నన్నేలుకొనవె । కానిమాటలు బలుకబోకూ ॥ కా ॥

శ॥ ఓరి నేపతివ్రతను నీకు । వొప్పదిటుల మాటలాడ ॥ వొ ॥ కూ్రరుడ నావిభుడునిన్ను । గూల్చివైచును వినరమూఢా ॥ గూ ॥

తా॥ పోరులోన నీదుపభుని । పారదోలి నిందువస్తి ॥ పా ॥ నారీమణి స్వర్గమునకు । నాథుడనై నిన్నుజూస్తి ॥ నా ॥

శ॥ మంచిమాటలతోడ జెప్పిన । మనసుకెక్కదు నీకుమూ్రరా ॥ వంచన పాలౌదువునా । వద్దటనిటు రాకుపోరా ॥ వ ॥

తా॥ పొమ్మటంచు బల్కకువో । కొమ్మరొనాకముద్దివావె ॥కొ॥ కమ్మవిల్తుని కేళినాతో । గలసిన సుఖమెుందెదావే । గ ॥

శ॥ కండకావరమున నిట్లు । గానకుండ బల్కకూరా ॥ గా ॥ దండిగుమ్మడిదాలపోరి । ధవళగాత్రుడు మెచ్చడూరా ॥ ధ ॥

వాదం — కందార్థములు,

శ॥ వినరోరి దానవాధమ । మనమున యోచించుకొమ్మి మద్వాక్యములన్ । ననుగోర మేలుగాదిక । ఘనమైన పతివ్రతాను । ద । కదలి

పోపో రా । దుర్మార్గ నీమదముడుగు క్రూరా । దనుజకాంతలెనీకు దగు
నూ సురలతో పొందు । మనమున గోరుట మరణహేతువునుమ్మి ॥క॥

తా॥ తరుణిరో నిప్పటినుండియు । సురలోకంబేలెదాను సుర
నాకుసదనై । వెరకేల నీవు నాదగు । వరసతివై తప్పకుండా॥ వలయూను
సుమ్మీ । భామరొనన్ను । వలపించరమ్మీ । సరసీరుహాక్షినీ । చక్క
దనమును జూచి । మరులొందియుంటినా । సరనాకు యిటుజేర ॥ వ ॥

శ॥ ఇలకర్కాటక వృశ్చిక । ములజాతికి జూడచావు మూడిన
వేళల । వంనొప్ప రతులదేలగ । తలపడి నశియించునట్లు ॥ దనుజాడ
నీకూ । నాపై ప్రేమ । దవిలియు జెడకూ । ఖలుడ యిక్కడినుండి
దొలగీ పోకండేస । చలమూచె చెప్పావె । శాపంబు బెట్టెద ॥ దను ।

తా॥ వనితా నీబెదరింపులు । విపన తలో నవ్వదోచె విరిబోడి
రొసీ । మనసందు నన్ను నాదగు । ఘనతయు గుర్తెరుగకుండ ॥ కాని
వాక్కులు । ఒల్కితె వినువ । బోను చాల్ చాలూ । వనజాక్షి
యిదుగోనీ వద్దకేతె చేత । కనికరంబుంచిన్ కౌగిట జేర్చావె ॥ కా ।

సం—వ॥ అని యిటుల తారకాసురుండు పైబడగా శచీదేవి
దూరంబుగా దొలగి యేమనుచున్నదన. (ఒ రే పాపాత్మాతొలగిపొమ్ము)

వాదం — దర్వు - చెల్లి.

తా॥ నారీ మదనుకారీ నాతో । మారుకేళికిటు రారమ్మీ ॥
శ॥ క్రూరా మరితపచారా సద్గుణ । దూరా ఛీ ఛీ పోపొమ్మీ ॥
తా॥ జలజముఖి యిటులాడకునాతో । చెలిమిజేసి సౌఖ్యముబొందూ ॥
శ॥ చలమదేల జేసెదవుర నన్ను । వలచువారికడ బొమ్మందూ ॥
తా॥ బలిమినోడ నిను బట్టి రమించెద । తలిరుబోడి యెటుబొయ్యెదవూ ॥
శ॥ ఖలుడా నీతల బ్రద్దలయ్యేటుల । కాలంబులో నసియించెదవూ ॥
తా॥ వూరకనన్నిటు బెదరించిననే । నూరకొనను నీపైబడితిన్ ।
శ॥ నారెకు గుమ్మడిదాల మహేశుని । సంస్మరించి శాపమునిడితిన్ ॥

సం-వ॥ అని యిటుల తారకాసురుండు శచీదేవిపై బడబోగా
నాతని వాడలంతయు మంటలెత్తినటుల దోచిన భయపడి యేమను
కొనుచున్నాడన, తా-గీ॥ దీని ముండ
మొయ్య దీని శాపంబేమొ ♦ కాని తెలియదాయె కష్టమాయె ♦ స్వర్గ
సుఖముకన్న చాన సుఖమేమి ♦ మేలుగలదు స్వర్గ మేలువాడ ।

చున్నది మహేశ్వరుని దవ్వ । యన్యులనే పెండ్లియాడ నంచు తన । మానసంబున వంతమానియుండె । సర్వేశ్వరుడు సర్వసంగపరిత్యాగి । యైతుహినాద్రిని యుతడుతపము । జేయుచుండెను మీరలు నేయువాయు । మైన జేసియు గిరిజను హరుడు పెండ్లి । యాడునట్టుల జేసిన యంబ గర్భ । మున జనించు సుతుండు దైత్యుని వధించు ॥

వ॥ ఇది నాయోగదృష్టివల్ల దెలిసికొన్న సమాచారము కావున,

వాదం - దర్వు - ఆది.

బ్రి॥ సురనాథ వింటివా । నిశి । చరుడు మరణమును జెందు విధము ॥ సు ॥ హరుడు గిరిజను పెండ్లియాడు నటు । తెరవుమీరు గని పెట్టి । పుర । హరునితపము జెడగొట్టి । పిరి । శరుని తాపమును బుట్టి । శరకంఠుడున్న । కష్టాలుమున్న ।సు॥

ఇం॥ సరసీరు హోద్భవా । హరునిష్టకేతుల భంగంబుగల్గు ।స॥ గిరిజకుహరునకు మద్వాహము నే । కరణిసేయ నగుదేవా । తెర । గెరి గింవు మహానుభావా । నీ । సరియెవ్వరు సంజీవా । కరుణించిమమ్ము । కడతేర్చుసుమ్ము ॥స॥

బ్రి॥ చింతేలనీకునూ । శచీకాంత విడియు రవ్వంతపనియు ॥చిం॥ యింతలోపలచె నీవు మన్మథుని । చెంతకేగి స్తుతియించుమా । మరు । న్వాంతంబును గరిగించుమా । నీవంత నెల్ల వినిపించుమా । అతనీచె నీవు । హితవొందెదావు ॥చిం॥

ఇం॥ మీరన్నతీరుగా । నే మొదలువాడ నిప్పటినుండియు ॥మీ॥ ధారుణి గుమ్మడిదాలలో వెలసిన । కారుణ్యాకరుడూ । ఫణి । హారుడు శంకరుడూ । సువి । చారుడు శుభకరుడూ । మన్నించునట్లు । మరి నల్పుదెట్లు ॥మీ॥

ఉ॥ ఎన్నడుశూలి గౌరివరి । యించు సుతుండెపుడుద్భవించుమా
మన్నవిరోధి తారకుని । యుద్ధము నందెపుడుట వధించుమా
కెన్నడు బోవు బాధలు వ । హింతుమె సౌఖ్యము ధీర్ఘ సేవగా
నున్నగతి యెంతకాలమని । యుందుమ దైవకృతంబదెట్టిదో ॥

వ॥ సరే పితామహా యికనాకు సెలవొసంగుము పోయివచ్చెదను.

బ్రి-వ॥ ఇంద్రా నీకు జయమగుగాక.

—( మేనకా హిమవంతుడు రాకడ )—

హిమవంతుని వాక్యము,

కం॥ సుమశరు సమసుందరుడగు ♦ సుమనసపతి వైభవుండు సుచరిత్రుండన్ ♦
సమరాంగణ విజయుండను ♦ హిమవంతుడ నాదుపేరు హితవుతో
వినరా । హిమవంతుని - దరువు.

గిరీంద్రుడను నే । సురేంద్రవిభవుడ । నరేంద్ర వందితుడనువినరా ।
హరీంద్రవిక్రమ పరాక్రముడయరి । కరీంద్రములధర గూల్చెదరా ॥౧॥

మాటలు

ఒరే ఒరే సమస్త లోకవాసులలో పేరెన్నికంగాంచిన వాడను.
అరి వీర భయంకరుడను పర్వతంబులకు ప్రభుండను. మన్నామంబు హిమ
వంతుడందురు దూతా వినయ విఖ్యాత.

మేనక

సరోజనేత్రిని । సవర్ణగాత్రిని । గిరీంద్రుభార్యను వరాననే ।
మరాళ గమనను । మహాగుణ శీలను । ధరందు మేనక వరాఖ్యనే ॥౨॥

మాటలు

రతిశతకోటి రూపలావణ్యంబు గలదానను సకల సద్గుణాలంకార
శోభితను, పర్వత రాజేంద్రుని పట్టంపురాణిని, మన్నామంబు మేనక
యందురు చానా మండయూనా,

హిమ - దరువు.

ఆర్తశరణ్యుడ । నమల స్వభావుడ । కీర్తివిశాలుడ నేవినరా ।
ధూర్త త్యాగుడ । స్వార్థరహిత స । ద్వర్తనుడను హిమవంతుడరా ॥౧॥

మాటలు

ఒరేఒరే సకల సుర మునిగణ వినుతుండను సుంచార తత్పరుం
డను అరివీర భయంకరుండను సాకధీ నయగుణ వారధీ.

మేనక - దరువు.

భూరి యశస్విని । పుణ్యచరిత్రిని । కారుణ్య కలిత హృదయను
నే । ధారుణి గుమ్మడి । దాలపోశీశుని । సారెకు సంస్తుతి సలిపెదనే ॥౨॥

మాటలు

ఘనతర వైభవోపేతను కరుణారసభరితహృదయును యీవ్రివం

మాటాలు సుఖలోలుఁడై । ఆహా । గిరీ । హిమాంశు సమవదనా । విన వెనే । ప్రమోద రసభరితన్ । వి । విమలాంగి చెలి సమూహాముతోనే । సుమావనమునందుఁడై । చరించుచు క్రమంబుతో వసించె । ఆహా । గిరీ । భూరి సుందరాంగి । వినవెనా । సరిలేరు యెందుఁడై । వి । ధరన్ గుమ్మడిదాల పురిని వెలయు శం । కరాని నేదలతుఁడై । మదిని సు । స్థిరంబుగా గొలతున్ ॥ ఆహా ॥ గిరీ ॥

చె-వ। సరే నాయొక్క వృత్తాంతమెల్ల సవిస్తరంబుగా వింటిని గాని యీగ్రంథమును కృతి జేయించిన వారెవరో కృతి జేసినవారెవరో వారి నామధేయాదుల నీ సభవారెల్ల వినునటుల దెల్పుము తల్లీ సుగుణాల వల్లీ.

పా-వ। చెలీ ఆలాగే విన్నవించెదను.

పా-సీ। శ్రీరమ్యమౌ మెదక్ జిల్లాలో వెలసిన ♦ తాలూక నర్సాపూర్ దనరునందు ♦ మేలైన గుమ్మడి దాలవాసుండును ♦ ధాత్రిశ్రీ కౌండిన్య గోత్రజుండు ♦ నల్లవంశుండును నయగుణ నిధుడును ♦ సాయన్న నాముండు సత్యశీలు ♦ డాతని సతులిద్ద రనువారి నామముల్ ♦ భాగమ్మ సాయమ్మ భవ్యగుణులు ♦ సాయమ్మ తనయులు శాంత స్వభావులు రామయ్య లింగయ్య నామములెలమి ♦ భాగమ్మ తనయుండు పరమకీర్తి విశాలి ♦ రాజలింగంబన తేజరిల్లె ॥ గీ। వీరు సత్కీర్తి వడయగా గోరిమదిని ♦ శర్వునకు భక్తుడైనట్టి చెర్వరాల ♦ భాగ యాఖ్యుని బిలిపించి బహుమతులను ♦ యిచ్చి యీకృతి జేయించి రింపుగాను ॥

చె-వ। అటులైన ఆనందమేకాని యిపుడెచటికేగుచుంటివి.

పా-వ। నాజననీ జనకులకడ కేగుచుంటిని.

సం-వ॥ ఇటులరుదెంచి పార్వతి తల్లిదండ్రులంజూచి యేమనుచున్నది.

పా-కం। దండము జననిరో నీకిదె ♦ దండము నముగన్న తండ్రి ♦ దయవారినిధీ ♦ దండిగ దీవించుడి మీ ♦ యండకు నిటుజేరవస్తి నతిమోదమునన్ ॥

తల్లిదండ్రులకు బిడ్డకు వాదం - దరువు.

మే। రావేనాపుత్రీ । రాజత గుణమైత్రీ । రమణీయగాత్రీ । కేవలముగ నీభావము లోపల । యేవరుని వరించితివో దెల్పుమిక । రా ।

పా॥ ననుగన్నతల్లీ । యీవరకె చెల్పితిని ఘనకల్పవల్లీ । కను గొనగాను త్రికరణ శుద్ధిగను । వనజారి ధరుని వరియించితి నే । వ ।

హి॥ పరమేశ్వరుండూ । సర్వము త్యజించిన । పర దేశిచూడూ । సురలందునొ కిన్నెలందునొకని । వరియించుమి శుభకర మగునీకును ॥ప॥

పా॥ జనకా యదేటీ । అట్లనుట నీకును । జను చెట్లు మేటీ । తను వరియించిన పురుషుడుగాకని । తనులగోరు మనధర్మంబగునే ।

మే॥ గతిలేనివానీ । గోరగ నీకైతెను । మహిలేదొకానీ । వెత లొందెవు యాశ్రితకంతుని నీ పతిగా నొప్పుట । హితవుగాదువిమ ॥గ॥

పా॥ గతిలేనివాడా బ్రహ్మాండమంతటికి । గతియతడెకాడా । పతితపావనుడు పరమేశునినీ । గతిదూరిన మిము గనవిన నొల్లను ॥ గ ॥

హి॥ తలిదండ్రిమాటా । వినకుండుట యొప్పునె । తనయానీనోట । వలనొప్పగ దెల్పుము నీవైతెను । తెలిసి బల్కెదవొ తెలియక బలి కెవొ ॥ త ॥

పా॥ జనకా నీ విట్లూ । మాటికి ప్రశ్నించుట । జననూ నీకెట్లూ తనయ వరించిన ధవునికివ్వకను । జనని జనకు లితరునకిత్తురయో ॥జ॥

మే॥ వద్దూ మాయమ్మా । యాశంకరుడైతెను । వృద్ధుడో యమ్మా । ముద్దుతనయ యా సుద్దిమానినీ । బుద్ధితొ నింకొక పురుషుని గోరుము ॥ వ ॥

పా॥ యెవరెన్ని జెప్పా । యేమాత్రము నింకొక । ధవునీ నేనొప్పా భువి గుమ్మడిదల పురమందిరుడౌ । శివుడే నాదగు జీవితేశ్వరుడు ॥యె॥

మే-వ॥ ప్రాణేశ్వరా తాబట్టినకుందేటికి మూడేకాళ్ళనునట్లుగా మనపార్వతి యెన్ని జెప్పిన వినకున్నది యిందుల కేమిసేయుదము.

హి-వ॥ తరుణీ నేనుకూడ అదే విచారించుచుంటుని,

స-వ॥ అని యిటులనుకొను చున్నంతలో,

—( నారదుడు – రాకడ – దర్వు – ఆది. )—

నారాయణశౌరీ ♦ పద్మ ♦ నాభ చక్రధారీ ♦ సారసలోచన సన్మునిపాలన ♦ పారవార గంభీర హృదయశ్రీ ॥ నా ॥ కరుణాకరశ్రీ కాంతమనోహర ♦ పరమాత్మా నీపదములె నమ్మితి ॥ నా ॥ పన్నగ శయనా పతితపావన ♦ సన్నుత చరణా ♦ సద్గుణా భరణ ॥ నా ॥ ధాత్రిగుమ్మడీదాల త్రినేత్రుని ♦ మిత్రపుణ్య చారిత్రసుఖసదన ॥ నా ॥

హి—వ। బ్రహ్మతాత్రి ప్రణామంబులు.

మే—వ। ఆర్యా వందనములు.

నా—వ। విజయాభి వృద్ధిరస్తు.

మే—వ। అమ్మాయియా యీ మునీశ్వరునకు ప్రణామంబులాచరింపుము.

పా—వ। స్వామీ అభివాదంబు లాచరించుచు దానను.

నా—వ। మనోవాంఛా ఫలసిద్ధిరస్తు శీఘ్రమే కల్యాణప్రాప్తిరస్తు.

హిమ — కందార్థము — జుల్వ.

సరసిజ సంభవ సుతమియా । రయదెంచుట చేశమాకు నతిముద మయ్యెర్ । కర మొప్పమాదు గిరిజయు । పర మేశుని దప్ప వేరే ॥ పతి నొల్లనంచు బల్కుచుండే । మా । మతికేమాత్రంబు దోచకుండే । హరుడు ఘోర తపసిరూప । ధరుడై సర్వాంగుముమీడి । స్థిరచిత్తముతోడ తపము । జేయుచుండె ననగవింటి ॥ పరిణయ మెటులాడును హారు డయ్యా । మా । గిరిజకరము జూచి దెల్పుమయ్యా ॥

నా—వ। ఔను నీవనుమాట యథార్థము. (అని పార్వతిహస్తము ను పరీక్షించి) నారాయణ నారాయణ. హిమవంతా నీ పూర్వపుణ్య వశంబున యీలోకమాత నీకు బిడ్డగా బుట్టినది. యీయమ్మ నేమని వర్ణింతును.

సీ॥ పదునాల్గు జగముల పాలింపగలతల్లి । పావనగుణముల పాల వెల్లి । పుడమి భక్తులకోర్కెలిడగ కల్పకవల్లి । గణుతింపగా కన్య కామతల్లి । తులలేని కళలకెంతో నిండు జాబిల్లి । కూతురై బొడమె దక్షునకుతొల్లి । నీపుణ్య వశమున నేడు సంశోభిల్లి । యమరగల్గెను సుఖం బావహిల్లి । త్రిభువనంబుల యందున తేజరిల్లి । సౌఖ్యముల నిచ్చు కరుణారసంబుజిల్లి । గిరిమ కైలాసపురమున గల్లిగల్లి । హారు నితో సంచరించు స్నేహము ఘటిల్లి ॥

వాదం — దరు — ఏక.

నా॥ గిరివర చింతించకూ । గిరిజా లగ్నంబుకూ ॥ గి ॥ కరి చర్మాంబర ధరుడే । వరుడగు నీ బిడ్డకూ ॥ గి ॥

హి॥ నమ్మజాల నారదా । నయగుణా విశారదా ॥ న ॥ యిమ్మహాదేవున్ని గాక । నితరుల వరియించదా ॥ న ॥

నా॥ తప్పదు నావాక్యమూ । తథ్యమనుచు నమ్ముమూ ॥ త ।
నొప్పను గిరిజకు శివునకు । నొనరజేయు యత్నమూ ॥ త ।

హి॥ యేరీతి నొనర్తునూ । యెటుల శివుని బిల్తునూ । యే ।
సారసభవ తనయ తగిన । సాధనంబు దెలుపుమా ॥ యే ।

నా॥ పార్వతి యిటనుండియూ । భక్తిని విడకుండియూ ॥ పా ।
శర్వుని యారాధించిన సర్వము సమకూడునూ ॥ పా ।

హి॥ సరెయటులె నొనర్చెదా । శాంతమును వహించెదా ॥ స ।
ధరణి గుమ్మడిదాలపౌరి । ధవళాంగుని దల్చెదా ॥ స ।

నా-వ॥ (పార్వతింజూచి) అమ్మా యిటురమ్ము నీకు శివుకు పవిత్రంబగు పంచాక్షరీ మంత్రముం దెల్పెదను. (అని నారదుండు పార్వతికి పంచాక్షరీ మంత్రముం దెల్పి వెడలి పోవుటయు నంత)

—( శంకరుడు రాకడ. )—

కం॥ శ్రీకైలాసనివాసుడ । కాకోదర భూషణుండ కరకంఠుండన్
లోకాధీశుడ యీశుడ । పాకారి నుతుండ నేను పరమేశుడరా ॥

మాటలు॥ శ్రీమత్ కైలాసాచల నివాసుడను కరుణారస కలిత హృదయుండను ప్రమథగణసేవితుండను పన్నగాభరణుండను మన్నామంబు పశుపతి యందురు వారీ పినుకొరి.

దరువు - ఏక - గతి.

ఈశుడ భూతేశుడ । ప్రమథేశుడ జగదీశుడా । అశతృష్ణ రహితుడరా । నాశంబొనర్చితి నక్తంచరులబట్టి ॥ ఈ ॥ శూలాయుధ ధారుడ । దిక్పాలుడ ధీలోలుడా । హాలాహల భక్షణుడర । వ్యాలభూషణుడాను వైభవోపేతుడ ॥ ఈ ॥ సురముని గణవంద్యుడా । నే । నూరిజనోద్ధారుడా । కరుణాసాగరుడరా నే । ధరణి గుమ్మడిదాల । పురమందు వెలసితి ॥ ఈ ॥

గీ॥ సారహీనంబు సకల సంసారమంచు ♦ దెలిసిపోయెను నేనింక దృఢతరముగ ♦ యింద్రియంబుల బంధించి యేకనిష్ఠ ♦ తపమొనర్చుట శ్రేష్ఠంబు తథ్యమిదియు ॥

సం-వ॥ అని శంకరుడు తపోనిష్ఠలో గూర్చుండి యుండుటయు నంత నక్కడ పార్వతీదేవి పూజా ద్రవ్యంబులంగొని తనతల్లిదండ్రుల వద్దికి వచ్చి యేమనుచున్నదన.

పార్వ - తల్లిదండ్రులకు - వాదం - ఏక.

పా॥ జనని జనకులార శివుని । చరణ పూజలు జేయనేగెద ॥ జ ॥ మనమునందనుమానముంచక । ఘనముగా దీవించి బంపుడి ॥జ॥

మే॥ కన్నతనయా నిన్ను బాసి । ఘడియ నోర్వజాల నేనిక ॥ క ॥ వన్నెగా పోయిరమ్మటంచు । పలుకుదెటుల నాదునోటను ॥ క ॥

హి॥ జంటనెవరు లేకనీవూ । నొంటిగా పోనలదుతల్లీ ॥ జం ॥ కంటకారణ్యంబులోన । కాలమెటుల గడిపెదుతల్లీ ॥ జం ॥

పా॥ అన్నివిధముల బ్రోచెడీయా । పన్నగభూషణుడుయుండా । కన్నతండ్రిరో భయమునొందుట । కాదునాకు సెలవొసగుడీ ॥ అ ॥

మే॥ అన్నపానాదులను రోసీ । కన్నవారల మమ్ము విడిచి ॥ అ ॥ చిన్నిముద్దుల తల్లి హాయని । సేవనెటుల జేతువో కానీ ॥ అ ॥

హి॥ దండిమృగముల జూచినీవూ । గుండెజడిసెదు బాలికామణి ॥ వెండికొండ వాసునీపై । వెఱ్ఱిభ్రమ నీకెందుకో కానీ ॥ దం ॥

పా॥ శివుని చింతనజేయువారికి । జెందవు కష్టములటంచును ॥శి॥ భవవిదూరులైన పెద్దలు । బలుకగ వినలేదె జనకా ॥శి॥

మే॥ అన్నిదెలసిన తల్లివలె మా । ట్లాడుచుంటివియేమనందును ॥ అ॥ యెన్నడు నేర్చితివో కానీ । యెరుగజాలను నీసుజ్ఞానము ॥అ॥

హి॥ పుత్రికా అటులైన శుభముగ । బోయిరమ్మా వద్దనము ॥ పు॥ ధాత్రిగుమ్మడి కాలవారి త్రినేత్రునీ ప్రసన్నునిజేయూ ॥పు॥

పా-వ॥ జననీ జనకులారా యిప్పుడుగదా నామనస్సు కుదుట పడినది మీపదపద్మంబుల కిదే ప్రణమిల్లుదానను దీవించి పంపుడు.

హి-మే-వ॥ మనోవాంఛా ఫలసిద్ధిరస్తు.

సం-వ॥ అని యిటుల పార్వతీదేవి తల్లిదండ్రుల యనుజ్ఞంగొని వచ్చుచు మార్గమధ్యంబున తన మదిలో పరమేశ్వరుని గూర్చి యేమని గొనియాడుచున్నదన.

పార్వ - దర్వు

శంభో శంకార వినునేనీదాననూ । డంభకాసురాంతక పరుల వేడనూ ॥శం॥ భావమున నిన్ను సేవించుచుంటినీ । జీవితేశుడవై బ్రోవుమంటినీ ॥శం॥ యెందుకని నీవు కృపజూడకుంటివో । మందమతినంచు ననుబ్రోవకుంటివో ॥శం॥ యెన్నియెటులైన నిన్నువరించితీ । సన్నుతాంగ

నీసేవకాసించితీ । శం । క్షితి సుమ్మడిదాల సత్పోరి ఖేలనా । సతత శ్రీనల్లనాయన్న పాలనా ॥శం॥

సం-వ॥ అని యిటుల శంకరుం జేరబోయి తపస్సు జేయుచున్న శివుని జూచి సంతోష స్వాంతయై నమస్కరించి యేవిధంబున పూజించు చున్నదన.

సీ॥ ఆవాహముసీకు నఖిల లోకాధీశ ♦ ఆసనంబిదె నీకు నమర వినుత ♦ వస్త్రయుగ్మంబిదే వారిజాక్షునిమిత్ర ♦ యగరు ధూపంబిదే యచలవాస ♦ గంధమక్షతలివే ఘనసర్పభూషణ ♦ కుంకుమంబిదెనీకు కూరదమన ♦ పుష్పాంజలిదెనీకు పురదైత్య సంహార ♦ బిల్వదళంబిదే భీమరూప । రాజమాళి కర్పూర నీరాజనంబు ♦ గైకొను పదేపదే నమస్కారశతము ♦ తను మనోధనంబులు నీకు దక్షిణలుగ ♦ నిచ్చుచుంటిని శంభో నన్నేలుకొమ్మి ॥

సం-వ॥ అని నమస్కరించినతోడనే శంకరుండు నేత్రంబులం దెరచి పర్వత రాజపుత్రిం జూచి యేమనుచున్నాడన.

శం-కం॥ ఎవ్వరిదానవు కన్యక ♦ యెవ్వరు నీతల్లిదండ్రి యెట నుండెదరో ♦ యెవ్వరు దోలిరి నిన్నిటు ♦ నివ్విధముగ నన్ను గొల్వ నెరిగింపుమిక౯ ॥

వ॥ కన్యకా నీవెవ్వరు నీతలిదండ్రులెవ్వరు నన్నీవిధముగా నారాధించుటకు నీకోరికెయ్యదో యెరిగింపుము.

పా-వ॥ స్వామీ నేను హిమవంతుని పుత్రికను నన్ను పార్వతి యని బిలతురు తలిదండ్రుల యాజ్ఞానుసారము మిమ్ము సేవింపవచ్చితిని, యీదాసురాలిని యనుగ్రహింపుడు.

వాదం – దర్వు.

శం॥ సరసీరు హాక్షిరోనీ । పరిచర్యకు మెచ్చితినీ ॥స॥ వరమడుగూ మిచ్చెదాను । గిరిజా నే ప్రేమబూనీ ॥స॥

పా॥ యెల్లప్పుడూ నీదుసేవ । యేనూవలచితినీ స్వామీ ॥యె॥ యుల్లాసమూతో వరమూ । నొప్పూగ దయసేయూమీ ॥యె॥

శం॥ రమణీ యిచ్ఛోటనుండ । గాదూ కాగండపడనీ ॥ర॥ నమబోడీ నీదుదారీ । జూడూ సంతోష మొందనీ ॥ర॥

పా॥ పర మేశ మీరలుండ భయమూ నాకేలనయ్యా ॥ ప ॥ పరగామీపాదసేవ ॥ దాసీ పోజాలనయ్యా ॥ ప ॥

శం॥ కన్నె ప్రియంపుదాన ॥ కష్టపడజాలవీవూ ॥ క ॥ వన్నెగ గృహములోనై ॥ భవమూగ నుండుదానవు ॥ క ॥

పా॥ సర్వేశ మీతోనున్న ॥ స్థలమే స్వర్గంబు నాకూ ॥స॥ సర్వ విధమూలసేవ ॥ సలుపుదా ప్రాణనాథ ॥ స ॥

శం॥ తగినా వరునీ వరించీ ॥ ధర్మంబు దప్పకానూ ॥ త ॥ మగ వారో సుఖము నొందుల ॥ మర్యాద యనుచు నీనూ ॥ త ॥

పా॥ నిన్ను విడనాడి నేనూ ॥ యన్యాల గోరజోనూ ॥ని॥ వన్నెగ భూషణా నాపైనా నీకరుణజూనూ ॥ ని ॥

శం॥ జలజాక్షీ నీమక్కోర్కె ॥ దెలిసీ కొంటిని నేనూ ॥ జ ॥ వల నొప్పగానునీకు ॥ వరమూ దయచేసెదాను ॥ జ ॥

పా॥ ధరణి గుమ్మడిదాల ॥ పురవాస యభిషేకేశ॥ధ॥ కరుణించీ నాదుకోర్కె ॥ నెరవేర్చు మిక్కిడనీశా ॥ ధ ॥

శంక – కందార్థము – జల్వా.

సీతల్లిదండ్రు లాజ్ఞ చె ॥ ప్రీతితో నొక వరునిమెచ్చి పెండ్లాడక నీ ॥ వీతీరు నిందువచ్చియు ॥ భీతిల్లక సేవజేయు ॥ బిసరూహా నేత్రి తగదు సుమ్మీ ॥ తనువు కసిగందెదావు చాలుపొమ్మీ ॥ వోతరుణీమణి వినవే ॥ వొప్పగ నావాక్యములను ॥ నే తపస్సులో నుండెద నీయిష్ట ము యిక పిమ్మట ॥బి॥

పార్వ – కందార్థము – జల్వా

గరళగళానివు వీడియు ॥ పరులను సేవింపనొల్ల భర్తవలిర్పక ॥ కరుణాకర సతతమునీ ॥ పరిచర్యలె గోరియుంటి ॥ భావంబునందున త్రిపురారీ ॥ నీవ ॥ భావంబూ దలచుచు మదికోరీ ॥ పరమేశ్వర నీత పస్సు భంగంబును జేయకుండ స్థిరచిత్తముతోడ నుందు ॥ వార మీ కరుణున్న జాలు ॥భా॥

శం-వ॥ మేనకాత్మజా అటులైన నీయిష్టము నేను తపోనిష్ఠలో నుండెదను నీవీ పరిసర ప్రాంతముల చరించు చుండుము.

సం-వ॥ అని యిటుల వచించి శంకరుడు తపోనిష్ఠలోనుండుటయు నంత నారదుండు యింద్రునివద్దకేగి నంతలో.

ఇం-వ॥ బ్రహ్మపుత్రా మీకిదో వందనంబు లాచరించువాడను.

నా-వ॥ విజయ ప్రాప్తిరస్తు.

ఇం-వ॥ నారదా యెక్కడివిజయము.

గీ॥ అసురులకు స్వర్గలోకంబు నప్పగించి ♦ గరుడ గంధర్వకిన్నర గణము చెరలో ♦ బడియు నేడ్చుచుమండగా పౌరుషంబు ♦ మాని యడవుల చరియించు వానికెట్లు ♦ విజయముఘటిల్లు చెప్పుమా విధికుమార ॥

నా-వ॥ ఇంద్రా యిక నీకష్టంబు కడతేరనుండెను గదా.

ఇం-వ॥ మౌనీంద్రా నీవెరుగని దేమున్నది వచింపుము.

వాదం - దరు - ఆట.

నా॥ చింతనొందబోకుమా ♦ శచీకాంతనీమది ॥చిం॥ అంతకంతకు శుభదినంబులు ♦ చెంతకేరుచు నున్నవికదా ♦ వంతయునువిడనాడి ధైర్యము ♦ స్వాంతమున ధరియించుటొప్పను ॥చిం॥

ఇం॥ మనసూ నిల్కడలేదుగా ♦ మునివర్యనాదగు ॥మ॥ వనజసంభవు డన్నటులయా ♦ ఘనమురారినిమ్రించపంచా ♦ ననునకును సుతుదుద్భవించుట ♦ గనుగొనగ కలలోని వార్తయు ॥మ॥

నా॥ తొందర పడబోకుమా ♦ దితిసందనాయిటు ॥తొం॥ యిందుమౌళికి గిరిజపైమన ♦ సందుపేర్మి జనించుటకుసిరి ♦ నందనుని పురికొల్పి బంపుట ♦ కుందగిన యత్నంబె జేయుమి ॥తొం॥

ఇం॥ వినునో తావినకుండునో । నామాటలు ॥ వి ॥ మనసిజుడు త్రిపురాంతకుని యా । ఘనతపంబును భంగపరచియు । కనికరంబుతో నన్ను సురలను గాచిరక్షించూనా తెలియదు ॥

నా॥ యేలా నీకనుమానమూ । నావెంటరమ్మిక ॥ నే ॥ చాలగా మకరధ్వజుని బ్రితి । మూలి యీపని కొప్పనట్టుల । లీలగానొనరింతు గుమ్మడి । వాల మందిరుడే గలండిక ॥యే॥

కం॥ పదవయ్య యింద్రయిప్పుడె ♦ మదనునిశేరంగబోయి మంచి వచనముల్ ♦ యెదలోన నాటజేసియు ♦ కదలించుక వచ్చెదాము ♦ కడు మోదమునన్ ॥

వ॥ ఇంద్రా మనమిప్పుడే యామునమశరుని సన్నిధానంబునకేగి మంచిమాటలచే నతని ప్రార్థించి నుత్సాహంబు గలుగజేసి యీపని కొప్పించెదము నావెంటరమ్మా భయంబు విగరజిమ్ము.

మ-వ॥ అటులే వచ్చెదను స్వామీ త్రిలోకగామీ.

సం-వ॥ అని యిటుల వారు వచ్చుచున్నంతలో.

—( మన్మథుడు రాకడ )—

క౦॥ వారయణు నందనుడను ♦ సారసబాణుండ సకల సద్గుణ ♦ పారావార గంభీరుడ ♦ మారుడ నాపేరు వినర మహా నీయుడరా ॥

మాటలు॥ శ్రీలక్ష్మీ నారాయణుల ప్రియ పుత్రుండను రతీదేవి మనోహరుండను శృంగార కళా శోభితుండను కుసుమ ధన్వుండను నన్నామంబు మన్మథుండని యందురు వారధీ.

దరువు - గత్తు.

మదనుడాని యందురా । సుఖ । సదనుడ జగమందునూ । సుదతి పురుషులందు ప్రేమ । నుదయింపజేసెద విశితంబు తోడూత । మ । జనని లక్ష్మీదేవిరా । నా । జనకుడు శ్రీవిష్ణురా । వనజబాణుడనుచు నన్ను । ఘనముగా బిలతూరు కాంతుతో నెప్పుడు । మ । సుకు చిరా కారుండరా । నే । నూరిజన నుతుండరా । గురుతర వైభవుడరానే ధరణి గుమ్మడిదాల ధామాని దలచెద ॥మ॥

సం-వ॥ అంత ఇంద్రుడు నారదుండదుదెంచినంజూచి.

మ-వ॥ దేవేంద్రా నమస్కారములు. ఆర్యా అభివందనములు.

ఇం-వ॥ మన్మథా నిన్ను జూచినంతలో నాకు కనులపండు వయ్యెను

నా-వ॥ మకరధ్వజా నీదర్శనార్థమై యింద్రుడు నేనును వచ్చి యున్నారము.

మ-వ॥ స్వామీ యెంత మాటాడితిరి నేనంతటి యోగ్యుడనా.

ఇం-వ॥ కాకేమి

సీ॥ నినుగన్నతల్లి యిందిరలోకమాత సం ♦ పదల విధూటి భామలకు మేటి ♦ నినుగన్నతండ్రి మాని సురాళిరతాప ♦ రాయణుండాది నారాయణునుండు ♦ నీమేనమామ తారామనోహరమూర్తి ♦ సత్కళలకు నీమ చందమామ ♦ నీతాతసఖులధునీనాయకుండు జ ♦ న శ్రీకరులడు రత్నాకరుండు ॥ నీవు నిఖిల చరాచర జీవకోటి ♦ మోహదాయక సంధాన

మోహనాస్త్ర ♦ భారవాహ జవోపేత కీరవాహ ♦ వరభృతచమూ విహార వైభవపురవార ॥

నా-వ॥ ఓరతివాయకా నీపరోపకార పారాయణత్వము మేమెరుం గమా నీవలన మాకొక సహాయము కావలసి యున్నది.

ఇం-వ॥ ఆ సహాయము మాకేకాదు సమస్త లోకంబులకని తెలియుము. వాదం - దస్వా - రూపకం.

ఇ॥ విను మన్మథ నీతోనొక । ఘనకార్యము గల్గియు నిటు । జనుదెంచిన వారము మా । కనుకూలుడ వీవగుటచె ॥వి॥

నా॥ దీన జనోద్ధారుడు ల । క్ష్మీనాథుని పుత్రుండవు । మీన కేతన నిల్పుము మాజనకుని సత్కీర్తి ॥దీ॥

మ॥ నావల్ల సహాయంబును నారద గోరితిరైతెను । భావము రంజిల్లగ మీ । సేవలు శేయగమంటిని ॥నా॥

ఇం॥ నీయొక్క యుదారత్వము । నేనెరుగని దేమున్నది । మా యెడ కృప గలిగుండియు । మాకోక నెరవేర్పుము ॥నీ॥

నా॥ యెవ్వరి వల్లను గాదని । యింద్రుడు నిన్నేగోరెను । పువ్విలుకాడవునీవే । పురుషార్థివి యీపనికిని ॥యె॥

మ॥ యెరిగింపుడి యీకార్యము । నెంతయు ననుమానింపక । కర మొప్పగ నెరవేర్చెద । కాదనజాలను నేనిక ॥యె॥

ఇ॥ యిందుగ వచియించినచో । సందేహించెద వనుచును । డెందములో విపులంబుగ । తొందర గల్గుచునుండెను ॥ముం॥

నా॥ శుభమన దేవేంద్రునకును । యభయ మొసంగిన దెల్పును । విభవోత్సవ శ్రీవందన । వెనుదీయకు నామాటను ॥శు॥

మ॥ ధరణిలో వెలసిన గుమ్మడి । దాల మహేశుని సాక్షిగ । వెరపొందను మీయాజ్ఞను । వెనుదీయను ముమ్మాటికి ॥ధ॥

వ॥ మానిందా యెంతమాటాడితిరి నాప్రతాపము మీరెరుంగనిదా.

సీ॥ పరమ పతివ్రతల్ వరను నీచాత్ముని ♦ యొక శయ్యలోన బరుండజేతు ♦ స్వప్నమందైనను సతుల గన్గొనవట్టి ♦ బ్రహ్మచారిని స్త్రీల పరికజేర్తు ♦ వ్రతదీక్ష బూనిన వనితను నొరుగూర్చి ♦ వెర్రి

కుక్క విధాన వెడలజేతు ॥ కలదమూలములను కదుమెక్కి కృశియించు ॥ యోగీశ్వరుని దండి భోగిజేతు ॥ చెరుకు విల్కాని చిగురాకు కరుకు చురుకు ॥ యెరుక లేదెవ్వరికి నింతవరకు మీకు ॥ వచ్చినటువంటి యాపద వరుసతోడ ॥ తెలియ జెప్పిన రక్షింతు దేవనాథ ॥

వ॥ ఇంద్రా.

కం॥ ఏమగువ నినువరించదొ ॥ యేమగువయు నిన్ను విడచి యేగెనో యదిగా ॥ కేమగువను గోరితివో ॥ యామగువను నీకుగూర్తు నరమరలేకన్ ॥

నా-వ॥ మీనకేతనా నీవంటి ప్రతాపశాలివేగాని మేము చెప్పబోవునది మగువలమాటగాదు.

మ-వ॥ కావున్న నదేకార్యమో త్వరగా విన్నవించుడు.

ఇం-వ॥ మదనా యిదో వినుము.

సీ॥ చంద్రశేఖరుడుతా సర్వంబు విడనాడి ॥ యతిఘోరతపమును నాచరింప ॥ బూనెను హిమవంతు పుత్రి పార్వతియును ॥ నాతని వరియించి నధికభక్తి ॥ సేవించుచుండె భూతేశుని తపములు ॥ మాన్పియు శంభుని మానసంబు ॥ గౌరిపైనిగురించి కామంబు గల్పించి ॥ బ్రీతితో వారలు పెండ్లియాడు ॥ నట్లుగావింప నీచేత నౌనటంచు ॥ వచ్చియాచించుచున్నాడ వనజబాణ ॥ యింతిమట్టుకు సాయంబు యీవుజేసి । ఘనతరంబైన పుణ్యంబు గట్టుకొమ్ము ॥

మ-వ॥ ఇంద్రా యీరవ్వంతపనికై నన్నిట్లు బాగుడవలయునా తప్పక నిప్పుడే యప్పరమేశ్వరుని గొప్పతపంబు భంగంబు గావించెదను మీరు నిశ్చింతతో నుండుడు.

ఇం-వ॥ ఆహా కందర్పా నీపరోపకార బుద్ధికెంతయు మెచ్చితిని.

నా-వ॥ మన్మథా యికమేము వెళ్ళవచ్చునుగదా.

మ-వ॥ సరే వెళ్లుడు నేనాడినమాట తప్పవాడనుగాను.

మ-చం॥ చిలుక హుమాయినెక్కి సరసీరుహ బాణము చేతబూని కో
వెలలు కుహూకుహూయనగ వేడ్కతో ఝుమ్మని చంచరీకముల్
వెలయగ మందమారుతము వెన్నెల రేడువసంతులాది నా
బలముతో నేగి యాశివు తపంబును భంగము జేతునిప్పుడున్ ॥

సం-వ॥ అని యిటుల మన్మథుండు తన పరివారంబుతో ప్రియా ణాంబగుచుండుటయు నింతలో.

—( రతీదేవి రాకడ )—

క౦॥ శ్రీవిష్ణుమూర్తి కోడల । భూవజనకు పత్నినమ్మ పద్మ దళాక్షిక । పావనగాత్రిని నను రతి । దేవియనుచు బిల్తురమ్మ । దివ్య చరిత్రిక ।

మాటలు॥ శ్రీమన్నారాయణమూర్తి కోడలనై మన్మథునకు భార్యనై శృంగార చారిత్రినై యసమానరూపలావణ్యవతినై వెలుగొందుదానను మన్నామంబు రతీదేవియందురు చానా హంసయాన.

దర్వు - ఆది.

హితమతితో శ్రీపతీ కోడలను । రతీదేవినమ్మా । సద్గుణ । పతీని నేనమ్మా । మరుడునా । పతీ వినవెతొమ్మా । కొమ్మా ముద్దులగుమ్మా యనదగు ।హి॥ తులలేని వైభవంబుచేనే । వెలుగొందుదానా । వన్నె చి । న్నెలూ గల్లదానా । మేటినా । చెలూవమునుగానా । గానా యోగబయానా వినగదె ।హి॥ యిలక్ గుమ్మడీ । దాలక్ వెలయు యూ । నీలగళుని దలతూ । మదిని ని । శ్చలంబుతో గొలతూ । సద్గుణ జాలంబు నేవఁతూ । వలతూ చెలుఁను । బిలతూ వేడ్కతో ।హి॥

సం-వ॥ అని రతీదేవి తన భర్తవద్దకేతెంచి యేమనుచున్నదన.

ర-వ॥ నాథా నమస్కరించుదానను యీ దాసురాలిని కటాక్షించుడు.

మ-వ॥ చెలీ వర్ధిల్లుము, కాని, నీవు చింతాకాంతురాలవై యున్నటుల దోచుచున్నది కారణమేమో వచింపుము.

రతి - కందార్థము - జాల్వ.

వినుప్రాణనాథ నాదౌక । మనవియు గలదేమటన్న మఘవుడు నీతో । పనిబూని దెల్పియుండిన । ఘనసంగతులేమొనాకు । కరుణించి దెల్పగోరి నానూ । యూ సురనాధుండేమనె మీతోనూ । యనుమానమునదోచి మిమ్ము । లడుగుచుంటి వనజభవుని । తనయుడు నారదు డెంతో । దండివానికారిసుమ్మి ।క।

మన్మ - కందార్థము - జుల్వ.

తారక పరమేశుడుతా । ఘోర తపోనిష్ఠయందు కూర్చుండెను యా । గౌరియతని వరియించెను । వారికి పరిణయముజేయ ॥ వాస వాదులును వాంఛబూని । యిటువచ్చి యుండిరి కీరవాణీ । నీరజాక్షీ శివుని తపోనిష్టను భంగంబుజేయ । నారదుండు యాకార్యము । నాకునొప్ప గించిపోయె ॥వా॥

ర-వ॥ ప్రాణేశ్వరా వలదు వలదు యీకార్యము నీతలపై బడ వేసికొనుటచే చాల మోసము సిద్ధించును అందుకనే నిన్నంటి రేయినాకు దుస్వప్నము గలిగినది నామాటవిని నీ తలంపును విడనాడిన మేలగును యెందుకనగా శంకరుడు సామాన్యుడు కాడు.

సీ॥ మూడులోకంబుల మొనసి యేలెటివాడు ॥ ముగురుమూర్తులలోన మొదటివాడు ॥ మూడుగుణంబుల మూలమైదగువాడు ॥ మూడు కన్నులుగల్ల మూర్తియతడు ॥ మూడు పురంబుల మోసపుచ్చినవాడు ॥ మువ్వన్నెవాలును మోపువాడు ॥ మూడు నాదులపైన కూడియుండెడు వాడు ॥ మూడు పనులుజేయ వూడువాడు ॥ భవుడు నతని తపోనిష్ఠ భంగపరచ ॥ నెంచియుండుట యదినీకు మంచిదగునె ॥ కుడచికూర్చుండ కను లేసినాడవదేల ॥ వెనుకముందు విచారించవేల నాథ ॥

మ-వ॥ ప్రేయసీ నా యిదా నీవు చెప్పబోవునది నాప్రతాపము నీకు దెలియదుగాబోలు.

కం॥ హరియైనను హరుడైనను ॥ సరసిజ భవుడైన సాధు సజ్జనులైనన్ ॥ మరియెవ్వడైన నాదగు ॥ విరికోలల చవినిగొన్న వెర్రియు గాడే ।

వాదం - దర్వు - ఆట.

ర॥ వలదు వలదూ । వలదు పోవలదూ ॥వ॥ చలముచేతను శివుని జనకుట వలనమోసము గల్గునూ ॥వ॥

మ॥ యింతచింతా । యేలనో కాంతా ॥యిం॥ యెంతకార్యం బిదియు చూత । కాంతునికి భయపడగనూ ॥యిం॥

ర॥ పరులమాటా । పాటించీవూటా ॥ప॥ హరుని తపమును భంగపరచిన । యాపదలు ఘటియిల్లునూ ॥ప॥

మ॥ అంచయానా । యటులనదగునా ॥అం॥ యెంచగా నాపంచ శరముల । నొంచనా త్రిపురారినీ ॥అం॥

ర॥ యేమిసేతూ । యెట్లుసైతూ ॥నే॥ నామనోహర మ్రొక్కనను త్రి । నయను జోలికి బోకుమా ॥యే॥

మ॥ వినను నేనూ । వేయిజెప్పిననూ ॥వి॥ మనసునో దలపెట్టు కార్యము । మాన నెన్నటి కైననూ ॥వి॥

ర॥ చారువిభవా । భూరి ప్రభావా ॥చా॥ ధారుణిలో వెలుగొందు గుమ్మడిదాల శంకర బ్రోవుమా ॥చా॥

సం-వ॥ అని మన్మథుండు తన పరివారంబుతో బైలుదేరుటయు నంత రతీదేవి కూడ రహస్యముగా తన పతిని వెన్నంటి వచ్చుటయు నట్లు మన్మథుండు కైలాసవాసుని సమీపించి తనలో నేమనుకొనుచున్నాడన.

మన్మ - దర్వు - ఆది.

అదుగో శ్రీ చంద్రశేఖరుండూ । ఘోర తపోనిష్ఠను । కుదురుగా నుండెను । భూతేశుండూ । వదలక నాదగు వనజబాణమును । యెదలో నాటెద నదెసమయంబిక ॥అ॥ సురలాకు మేలూ జేసెదానూ । గౌరీ శంకరులా పరిణయమూను గావించెదానూ । కరమొప్పగ నాఘన సాహసమును । సురలు మునులు గని సరిభళియనగను ॥అ॥ యేరీ నా సాటీ పురుషాగ్ర్యూడు । ముల్లోకములందున లేరంచు దెలిపే నారదూడు । ధారుణి గుమ్మడిదాల పౌరీశుని । ఘోర మోహసాగరమున ముంచెద ॥

సం-వ॥ అని రహస్యంబుగ నొకచో దాగుండి పూవుటమ్ముల వైచును అంత శంకరుండు కన్నులందెరచి.

శం-వ॥ అహా ఈ నాడిది యేమిచోద్యము.

ఉ॥ చల్లనిగాలి వీచె మనసంతయు చంచలమొందుచుండె మే
నెల్లను పూవుటమ్ములు ననేకము నాటుచునుండె కోవెలల్
కొల్లగ కూ కుహూ యనుచు గూయుచునుండెను చంచరీకముల్
నల్లన ఝుమ్ము ఝుమ్మనుచు నారడిబెట్టుటిదేమి చిత్రమో ।

వ॥ ఇది యంతయు నింద్రజాల మహేంద్రజాలముగా నున్నది యెవడో దుర్మార్గుడు నా తపోనిష్ఠకు భంగంబు గల్పించెను అట్టివాడెవ్వడైన నేమి.

గీ॥ దుష్టుడెవ్వడో నాతపోనిష్ఠకిటుల । నంతరాయంబు గల్పించె నింతలోన । పాపమనకను నాయొక్క ఫాలనేత్ర । వహ్నిచే భస్మపటలంబు వానిజేతు ॥

వ॥ ఓ పంచభూతములారా నా ప్రతిజ్ఞ వినుండు బ్రహ్మేంద్రాదులు యక్ష రాక్షస సిద్ధ సాధ్య కిన్నర కింపురుష ప్రముఖ మఖభుక్కులు వేడికొనిన సప్తపర్వతంబులు పెల్లగిల్లిన సప్తసాగరంబు లేకీభవించిన నవగ్రహంబులు తమగతులు దప్పిన నన్ను భంగపెట్ట దలచినవాడు నా ఫాలనేత్రవహ్ని జ్వాలలచే మిడుతకైవడి భగ్గునమండి భస్మంబగుగాక.

మ-వ॥ హాహతోస్మి హాతోస్మి. (అని కాలి భస్మమైపోవును. అదియంతయు రహస్యముగా నుండి చూచుచున్న రతీదేవి హా పరమేశ్వరాయని మూర్ఛిల్లి కొంతవడికి లేచి)

ర-వ॥ హా మనోహరా యెంతటి విపరీతంబు సంభవించెను. (శంకరుని సమీపించి పాదపద్మంబులపై (వ్రాలి) ఉమా రమణా రక్షింపుము రక్షింపుము.

**శం-వ॥** యువతీ నీవెవ్వరు దూరముగా నుండుము.

ర-వ॥ కైలాసనాథా నేను రతీదేవిని మన్మథుని యపరాధంబుల క్షమించి పునర్జీవితునిగా జేయుము.

వాదం - రతీదేవి - అట - శంక - ఆది.

ర॥ దేవదేవా । మమ్ముల(బ్రోవ । నీవెకావా। నావిన్నపంబుల నాలకించియునాదు । జీవితేశుని మరల । జీవింపగాజేయు ॥ దే॥

శం॥ కండకావరముచె కన్ను । గానక నేతపోనిష్ఠ । నుండగనిటులా । యీ । దుండగుడెటులా హంచుండియు చాలా । యిటు జేసే । నటుమడినే ॥కం॥

ర॥ లోకపాలా ! సద్గుణ భక్తానీకలోలా । నీకుదెలియనిదేమి శ్రీకంఠ గలవయ్యా ' కాకోదర విభూష । కరుణించు మొర్క్కెద ॥లో॥

శం॥ అందరివలెనన్ను నెంచి । మందబుద్ధి కందర్పుడు । నిందరు దెంచే । నా । డెందము గలచే । బ్రహ్మ । నందము జెరచే । మదమెచ్చే । మరిజచ్చే ॥అం॥

ర॥ తాళజాలా । రక్షించరా కరుణాలవాలా । జాలిజెందియు ప్రాణలోలుని బ్రతికించి । క్రీలోలుడను యార్తి జెందకుండగ జేయు ।

శం॥ కంతునికొరకై నీవిటు । చింతించిన ఫలము లేదు । యెంతకైననూ । నీ । కాంతుడి కనూ । రా । డంత యొందెనూ । చాల్ నుమిమ్మా । పోపొమ్మా ॥కం॥

ర॥ భోలనాథా । శంకరనోర్వ । జాలబాధా । మేలుగుమ్మడిదాల ప్రోలుమందిరవాస । యీలోన పతిభిక్షమిచ్చినన్ రక్షించు ॥భో॥

వ॥ సర్వేశ్వరా నాపతిని పునర్జీవితునిగా జేయకుండిన నీపాద పద్మముల సన్నిధానమున నా ప్రాణముల విడిచెదను. ఇదో చూడుము. (అని యెదలో బాకుతో పొడచుకొనబోవ)

శం-వ॥ రతీ తాళుము తాళుము.

గీ॥ బ్రహ్మదేవుని తనుగన్న భారతికిని ♦ వావివరుసలు నెంచక వారిలోన ♦
కామముత్పన్నము జేసి కలిపెగాన ♦ నట్టిపాపంబు నీభర్త యనుభవించె॥

వ॥ అయినప్పటికిని నేను మొదలు మన్మథుండు అనంగుడై యువతీ యువకుల పీడించునట్లును నీకుమాత్రము యధారూపుండౌ నట్లను గ్రహించితిని యిక నీవేగుము.

సం-వ॥ అనిన రతీదేవి శంకరునకు నమస్కరించి వెడలి పోవుటయు నంతట యుమాకాంతుండు తనలో నేమనుచున్నాడన.

శం-గీ॥ సతినిబాసి తపము సల్పుచున్నచో ♦ భంగమయ్యె మరుడు భస్మమయ్యె ♦ రెంటజెడియు నేను నొంటిగుండగనేల । గిరిజ హృదయ మరయ నరుగువాడ ।

సం-వ॥ అని శంకరుడు దలపోసి యచ్చటినుండి వెడలిపోవుటయు నంతలో పార్వతి యరుదెంచి యచ్చోట శివుండు లేకుండుటం గాంచి తనలో నేమని దుఃఖించుచున్నదన.

పార్వతి - దర్వు - ఆట.

ఇందుసేఖర నీవు । యెందుబోయితివో నా । యందు నీదయ మానియనా । ప్రాణేశనా । యందు । కుందధవళగాత్ర సుందరాకారనీ । యందేనా మనసు నిం । పొందియున్నది స్వామి । ఇం । యెన్నిజన్మంబులు నెత్తినప్పటికైన । నిన్ను నే విడజాలనూ । నా ప్రాణేశ । ని ।

పన్నగభూష నాపన్న రక్షకనిన్ను । సన్నుతించెద సుప్రసన్న హృదయుడవంచు ॥ఇం॥ రమ్మ నీ దరిశన మిమ్మ నిరతము నిన్నే । నమ్మియున్న దాననూ । ప్రాణేశనిన్నే ॥న॥ యిమ్మహిలో వెలయు । గుమ్మడిదాల గారి । మమ్మాన నెలకొన్న మహాదేవ త్రిపురారీ ॥ఇం॥

సీ॥ తరులార చూపరే ధవళగాత్రుందున్న ♦ తావును మీరైన దయ దలంచి ♦ గిరులార చూపరే పురహరుడున్నట్టి ♦ నెలవును మీరైన నెనరునుంచి ♦ శరులార చూపరే గరళకంఠుండున్న ♦ స్థలమును మీరైన చలము విడచి ♦ హరులార జూపరే పరమేశ్వరుండున్న ♦ జాడను మీరైన సత్యమెంచి । ఘనతరంబైన పశుపక్షి గణములార ♦ పన్నగములార మీరైన పరమశివుకు ♦ గల్లచోటును దెలిపినా కెల్లగతుల ♦ సాయమొనరింపుడిక నేవిధేయురాల ॥

సం-వ॥ అని యిటులనుచున్నంతలో శంకరుండొక బ్రాహ్మణ బాలకుని వేషమును దాల్చి వచ్చెనెటులన.

బ్రాహ్మడు – దర్వు.

బ్రాహ్మణ కులజుడను । బ్రహ్మచారిని నేనూ ॥బ్రా॥ బ్రహ్మాండ పురాణమును బాగుగ జదివినానూ ॥బ్రా॥ గురుకుల వాసమును । క్షోణి జేసితినేను ॥గు॥ గురువి యాజ్ఞగొని నేడూ । సరగున యిటువచ్చినానూ ॥బ్రా॥ కాశీకిబోయీ విశ్వేశుని దర్శించెదానూ । ఆశతో దుత పాపనాశిలో మునిగెదానూ ॥బ్రా॥ సకలయాత్రలు నేను । చక్కగాదిరిగెదానూ । ప్రకటిత గుమ్మడిదాల । పరమశివుని దలచెదానూ ॥బ్రా॥

మాటలు – హాస్యగానితో.

హా॥ అయ్యా మీరెవరు.

బ్ర॥ నేను బ్రహ్మచారినిరా.

హా॥ బ్రహ్మచారి అనగా నాకు దెలియదు.

బ్ర॥ ఒరే నీవు మూఢునివత్తుగా నున్నావే.

హా॥ మూఢుడనగా నేమిటయ్యా.

బ్ర॥ "మూఢో మూర్ఖోగార్ధభ స్యైకరాసిః" యికనైనా తెలిసిందా.

హా॥ ఆ తెలిసింది. అయితే నేను గాడిదనా.

బ్ర॥ అట్లుగాదురా. జ్ఞానములేనివాడు గాడిద, వాడే ఛండాలుడు,

హా॥ ఛండాలుడనగా నెవరయ్యా.

బ్రి-శ్లో॥ పక్షీణాంకాకి ఛండాలి । మృగ ఛాండాలి గార్దభః

మనుష్యానాం కోపి ఛాండాలి । జాతిఛండాల ఉత్తమః ।

హా॥ సరేకాని నీ విప్పుడెక్కడికి బోవుచున్నావు.

బ్రి॥ నేను కాశీయాత్రకు బోవుచున్నాను దారితప్పి యీా యడవిలో ప్రవేశించినాను నీ వెరిగియుండిన చెప్పుము.

హా॥ చక్కగ యిదే దారిన బొమ్ము.

సం-వ॥ అనిన యాబ్రహ్మచారి అటనుండి బయలుదేరి చక్కగా పార్వతీదేవి వద్దకరుదెంచినం జూచి.

పా-వ॥ ఆర్యపుత్రా నమస్కారములు మీరెవ్వరు యెందేగుచుంటిరి.

బ్రి-వ॥ యువతీ నేను బ్రిహ్మచారిని కాశీయాత్రకు బోవుచుంటిని నీవీ యడవిలో నొంటిగా నుండుటకు హేతువేమి నీ పేరెయ్యది నీ తలిదండ్రాదు లెవరు.

పా-వ॥ నేను హిమవంతునిపుత్రిని నన్ను పార్వతియని యందురు.

బ్ర-వ॥ అటులైన సరేకాని.

ఉ॥ నీ నగుమోము నీనడలు । నీమెయి చక్కదనంబు నీ వరి
జ్ఞానము నీ సులక్షణము । గాంచిన ఘోరతపంబు జేయగా
కానలనుండగా దగవు । కంతునిబోలిన కాంతుగూడి మే
లైన సుఖంబు లొందుచు న । హర్నిశముండెడి దానవక్కటా॥

వాదం — దర్వు - ఏక (మునివరేణ్యా)

బ్ర॥ తరుణిరో నినుగన్న తల్లీ । దండ్రిలా విడనాడియూ ॥ త ॥ మరుని చిలుకలకొలికి వొంటిగ । దిరుగుటేలనో కానియూ ॥త॥

పా॥ జననిజనకుల యాజ్ఞగైకొని । ఘనతరంబగు దీక్షనూ । జ । మనసులోన వహించియిట్టి । వనములో నున్న దాననూ ॥జ॥

బ్ర॥ కన్నెరో యిటులుండనీకు । కాదు కాదు వినుమికా ॥క॥ వన్నెచిన్నెల మగని జేనుక । వైభవంబుతో నుండకా ॥క॥

పా॥ శివునకొరకై తపము నేను । జేయుచుంటిని యువకుడా ॥శి॥ భవుడునా కోరికను దీర్చె । వరకు నిటుపలె పారుడా ॥శి॥

బ్రి॥ యేమికోరిక గోరినీవు । నింతిరోయీతీరుగా ।యే॥ సోమ
సేఖరు కొరకు తపము । కామినీమణి సల్పగా ।యే॥

పా॥ హరుని నేవరియించి తపమూ । నాచరింపగబూనితీ ।హ॥
హరునికే నాతనుమనంబును నర్పణంబును జేసితీ ।హ॥

బ్రి॥ తెలసి నీయాజ్ఞానమెల్లను । జలజలోచని నాకికా ।తె॥
పలువురూ యీమాటవిన్నను । పరిహసింతురు నిన్నికా ।తె॥

పా॥ యేలయిటువలె బల్కుచుంటివా । యేమిదోచదునాకునూ ।
యే॥ మేలుగా వచియించు గుమ్మడి । దాల యభవునితోడున్నూ ।యే॥

బ్రి-వ॥ ఈడువచ్చిన యింతికి యింటివెనుకన మగడు. పార్వతీ నీపిచ్చితనంబునకు నేనేమందును. హరుడు నీకు మగడా. సకే భలే మంచివరున్ని గోరుకొంటివి.

పా-వ॥ భూసురా యీ యనవసర ప్రసంగములు మానుము నేను తప్పక ఈశ్వరునే వరించితిని

బ్రి-వ॥ పార్వతీ నీవెక్కడ యీ హరుడెక్కడ. ఈశ్వరుడు కడువృద్ధుడు సన్యాసి దిక్కులేనివాడు. నీవైతె మహారాజ కూతురువు. అదిగాక.

సీ॥ యువిద నీముంగురుల్ యుంగరాలనుబోలు ♦ సఖియ నీవదనంబు శశిసమంబు ♦ సతి నీకుచంబులు చక్రవాకంబులు ♦ తరుణి నీనడక దంతావళంబు ♦ పడతి నీహస్తముల్ బంగారుకోలలు ♦ మానినీనీమాట తేనెలొలుకు ♦ చెలినీదు మధ్యంబు సింహమధ్యంబును ♦ కాంతనీమేను బంగారుతీరు । యిట్టి నీ సోకుగము గనిపెట్టకుండి ♦ పనికి మాలిన శివుని నీభర్తగాను ♦ గోరుచుంటివి తగునటే గొప్పవారి ♦ బిడ్డవగుటచె నీకు నో బిసరుహాక్షి ।

పా-వ॥ ఒరే బాపడా యేమని కూసితివి.

గీ॥ హరుడా కూరుడా నీవు భంగిద్రావి ♦ యుంటివో వెర్రితీగ నిన్నంటుకొననో ♦ విశ్వనాథుని నిందనే వినుటవొల్ల ♦ వేయిమాటలికేలను వెడలిపొమ్ము ।

బ్రి-వ॥ ఓహైమవతీ అట్లు కోపింపకుము నేనున్నమాటంటిగాని మరేమియుగాదు కాచుక నావాక్యంబు లాలకించుము.

వాడం — దర్వు — ఏక.

బ్ర। హరుని గోరకు సుమ్మనీకూ । అందముగాదే గారీ ॥అం॥
పరమ వ్యర్థుని కోరకుయింత । భ్రిమపడనేలా గారీ ॥భ్ర॥
పా। వ్యర్థుడవై నీవు హరుని । వ్యర్థుడనెద వెందుకూరా ॥వ్య॥
స్వార్థబుద్ధితోడ నీదూ । జనుదెంచిన వాడవౌరా ॥జ॥
బ్ర। చూచెటందుకు మూడు కన్నులు । సొగసులేని వాడెగారీ ।
సొ। పూచినటుల భూతిమేనా । బూసికొనెడు వాడెగారీ ॥బూ॥
పా। శశిరవాగ్ని లోచనునీ । సౌందర్యుడు గాడనేవా ॥సౌ॥
పశుపతినీ నిందజేయు । పాపమనుచు దెలియలేవా ॥పా॥
బ్ర। పచ్చితోలు గప్పుకోని । పాములను ధరించు గారీ ॥పా॥
మెచ్చదగినవాడుగాడూ । మిగుల ముసలి వాడుగారీ ॥మి॥
పా। సర్వేశుడు శివుని నింద । సలుపుచుంటివేర కూరా ॥స॥
సర్వేశారుడు నిర్గుణుండూ । నీలకంఠుడు దెలియవేరా ॥నీ॥
బ్ర। భిక్షమెత్తిన కూడు పుర్రెలో । ప్రీతితోడ మెక్కునుగారీ ।
ప్రీ। కక్షపాల దప్పవేరే । కలిమిలేని వాడుగారీ ॥క॥
పా। లోకపాలకుండు శివుని । లోతు దెలియ లేవుపోరా ॥లో॥
ప్రాకట సద్భక్త వరదుడు । పరమేశుండతడు గదరా ॥ప॥
బ్ర। భూతములకు నెకిమీడు । పుణ్యుడతడుగాడు గారీ ॥పు॥
ప్రీతితో మునలెద్దునెక్కి । ఖ్యాతిగా దిరుగాడు గారీ ॥ఖ్యా॥
పా। పంచభూతములకు తానే । ప్రభువరుండు యిందుధరుడూ ।
ప్రి। యెంచగా గుమ్మడిచాల । యీశ్వరుండే నావరుండూ ॥యీ॥
బ్ర-వ। నళినాక్షీ నీ పట్టిన పట్టును విడువకున్నావు నా మనసు లోనిమాట నొక్కటి గలదు వినుమా.

పా-వ। అదేటిమాటనో వెడల గ్రక్కుము.
బ్ర-వ। నేను సౌందర్యవంతుడను గానా.
పా-వ। నీయంతకు నీవే సౌందర్యవంతుడవు.
బ్ర-వ। అటులైన నన్ను వివాహమాడి సుఖింపరాదా.
పా-వ। క్షీమూర్ఖా.

గీ॥ ఔర నెంతటి వాడ వౌరౌర నేను । యాడుదానను యెంటిగా నబ్బెనంచు । యిట్లు మాట్లాడితివ చెంపపెట్లు నిదుగో । వచ్చు దారిని గని బుద్ధి దెచ్చుకొమ్మి ।

సం-వ॥ అని పార్వతి యాబ్రిహ్మచారి చెంపపై గొట్టును.

బ్రి-వ॥ కోమలాంగీ నన్ను కొట్టిన గొట్టును తిట్టిన దిట్టును కాని నీవా శంకరుని మాత్రిము వరింపకుము వాడు గర్భదరిద్రుడు యెట్లంటె.

సీ॥ నిశ్చ తాంబూలంబు నీకు బెట్టెడు వేళ ॥ వచ్చితోలును దెచ్చి పైనగప్పు ॥ పిల్లడా బుక్కను జల్లుమటన్నను ॥ వరగ బూడిదను నీపైనజల్లు ॥ సొమ్ముల పెట్టెను దెమ్మన్న పాముల ॥ పెట్టెనునీముందు బెట్టునిజము ॥ సారి బైలెల్లెటి సమయానముసలెద్దు ॥ గొనివచ్చినీముందు కోర్కనిదును ॥ అత్త మామలు నీకు రేరాదుబిడ్డ ॥ లైతె లేరును బంధువు లంతెనుమ్మి ॥ వెనుక ముందు విచారించు వెలదినీవు ॥ శంకరుని గోర సుఖమేమి పంకజాక్షి ॥

వ॥ కావున నన్ను పెండ్లి జేసికొన్నచో నీవన్నివిధముల సుఖపడెదవు.

పా-వ॥ దురాత్మా నీకు పెండ్లి కావలెనా యిప్పుడే చేసెద నిలువుము,

సం-వ॥ అని నొక కట్టె దీసుకొని వచ్చి కొట్టబోయినంతలో యా బ్రిహ్మచారి పరమ శివునిగా మారిపోవును. అదిజూచి పార్వతి పరమేశ్వరుని పాదంబులపై వ్రాలి లేచి సిగ్గున తలవంచుకొని యేమను చున్నదన,

కం॥ దేవాదిదేవ నిను భూ ॥ దేవుడ వనుకొనియు కొట్టి దిట్టితి నిక న ॥ న్నేవిధమున మన్నింతువో ॥ భావజ శతకోటిరూప ప్రాణేశ శివా ।

శం-వ॥ హైమవతీ నిన్ను పరీక్షించుట కిట్లు విప్రాకారముంబూని వచ్చితిని యిందునీదోషమేమాత్రము లేదు. రమ్మా నాకొక యాలింగనంబిమ్ము.

వాదం - దర్వు - ఏక.

శం। రావె రావే గిరిజా। రమణీమణి ముఖసరోజా।రా। భావ మానందమాయె। ఫలియించెను నీదుపూజా।రా।

పా। నామనోనాయకా। నతభక్తపాలకా।నా। కామసంహార నన్ను। కరుణించి బ్రోవుడికా।నా।

శం। కీరవాణిరో గౌరీ। నారీశైలకుమారీ।కీ। సారసాక్షిరో నన్ను। జేరరా నామనోహరీ।కీ।

పా। ఫలియించే నాదుపుణ్యా। ఫలమూ నిఖిలాగ్రగణ్యా।ఫ। నలలితాకార శంభో। సర్వముని గణ శరణ్యా।ఫ।

శం। మారు బారికి నేనూ। మగువరో తాళలేనూ।మా। చారు సుందరి నన్నూ। జేరరా ప్రేమతోనూ।మా।

పా। ధరణి సమ్మోహిదాల। పురభక్త పరిపాలా।ధ। కరుణసాగర నిన్నే। వరియించితి ప్రాణలోలా।ధ।

శంక। కందర్పుని విరి శరముల। జెందముగాసిల్లె నేను యేమా త్రిము యో। సుందరి తాళగజాలను। సందేహామదేల నాదు సరసకు రమ్మా।

వాదం - జల్వ

పా। తొందర పడబోకుడి ప్రాణేశా। మదియందు తాల్మిజెందుడి భూతేశా। యిందుమఖాళి నీపదార విందములకు మ్రొక్కెదాను। కంద ర్పదమన సకల। కారణ కర్తవు నీవు।తొం।

శం। తరుణీమణి దయుదలంచు మాటీ। నుమశరుసీ తూపులకు తాళనటీ। కరియానరో వినవేయా। తరునీడల శయనించియు। కరు వునీర భోగింతము। యరమరేల నీకింక ను।త।

పా। అన్నిదెలిసి యిటుల బల్కుటేలా। యోపన్నగభూషణ త్రిలోకపాలా। నన్నుతాను రేంద్ర నీను సంతోషముకన్న మిక్కి లున్న దేమినాకు నుప్పి। సన్న వదన సర్వేశ్వర।అ।

శం। పువ్వుబోడి మరుడువనుగలంచే। నీ నవ్వుమోము జూచి మదిచలించే। రవ్వచేయుబోకుమింక। రావేనను కౌగిలించి। నవ్వుచు మాట్లాడిచుంబ। నంబివ్వవె తాళజాల।పు।

పా॥ తలిదండ్రులు పెద్దలున్నవారూ । యావల మనలను గేలిజేసె దారూ । తలపెట్టకు గాంధర్వము తగవుతగదు జీవితేశ । వలనొప్పగ బ్రాహ్మణ్యవి । వాహమె మనకొప్పనుమ్మి ॥త॥

శం॥ సంతసించినాడను నీమాటా । వో కాంతామణి లోకవిదిత మాటా । యెంతకైన నీదుహృదయ మెరుగగోరి యటులంటిని । యింతలోన మనవివాహ । మేర్పాటును జేయవలయు ॥సం॥

పా॥ సరెయటువలెనైన వేశ్కతోనూ । నా । జననీ జనకులను జేరగానూ । కరమొప్పగ బోదామిక గరళకంఠతడవేలను । ధరణీగుమ్మ డిదాల । పురవాసులు మెచ్చునటుల ॥ స ॥

సం_వ॥ అనిపార్వతీదేవి పరమేశ్వరుని దోడుకొని వచ్చుచున్నంతలో నక్కడ మేనకా హిమవంతులు తమలో నేమనుకొనుచున్నారవ,

మే-వ॥ ప్రాణేశ్వరా మనపార్వతి యింతవరకు రాదాయెగదా.

ఉ॥ ఎక్కడి కేగెనో గిరిజ ♦ యేమని శంభుని తావరించెనో
యెక్కడ సంచరించుచును ♦ యేవిధి నున్నదో యన్నపానముల్
యెక్కడ జేయుచుండెనొకో ♦ యెవ్వరు దెల్పరు పుత్రిజాడలన్
యెక్కడి పట్టుబట్టెనో యి ♦ దెంతటి పాపము నామనోహరా ।

హి_వ॥ సఖి మనమేమి జేయువారము యెన్ని యో విధంబుల బుజ్జగించితిమి, వినకుండెనుగదా.

వాదం _ దరువు - ఏక.

మే॥ యింతవరకు రాదుగిరిజ । యేమిదోచదుగా ॥యిం॥ యెంత జెప్పిన వినక భూత । కాంతుని కోర కేగెగా ॥యిం॥

హి॥ యెందు సంచరించుచుండెనో । యిందుమౌళి కొరకునూ ॥ యెం॥ డెందమందు భీతినొంది । గుండెనో యేమందునూ ॥యెం॥

మే॥ యెన్నడు ననుబాసియుండు । టెరుగదు నాపుత్రియూ ॥యె॥ పన్నగభూషణుని గూర్చి । బాయెకమల నేత్రియూ ॥యె॥

హి॥ యింతసాహసంబుపుత్రి । కెటులగల్గెనో కదా ॥యిం॥ చింత నొందజేసె మనల । కాంతనెటుల సైచెదా ॥యిం॥

మే॥ చారుల దోలించి పుత్రి । జాడల దెప్పించుడీ ॥చా॥ యేరీతిగ నైనగారీ । నిందుల రప్పించుడీ ॥చా॥

హి॥ సరెసరే నీవన్నవిధము । సలిపెదనో మానినీ ॥స॥ ధరణి గుమ్మడిదాలపారీ । హారునిదలచి కామినీ ॥స॥

మే-వ॥ నాథా అదేదో వీణారవము వినవచ్చుచున్నది నారద భగవానుడు గాబోలు వారిని విచారించిన మనకన్నియు దెలియును.

నారదుడు ప్రవేశము — దర్వు.

నారాయణశౌరీ । పద్మనాభ చక్రధారీ । సారసలోచన సన్ముని పాలన । పారవార గంభీర హృదయశ్రీ ॥నా॥

హి-వ॥ నారదా నమస్కారములు మీరాక మాకు శుభదాయ కంబని దోచుచుండెను.

మే-వ॥ బ్రహ్మపుత్రా ప్రణామములు మీరరుదెంచుటచే నా మనస్సు కొంత కుదుటపడినది.

నా-వ॥ మేనక హిమవంతురాలా మీరేదో చింతతో నున్న ట్లుగా దోచుచున్నది అదేదో విన్నవించుడు.

మే-గీ॥ అబ్జసంభవపుత్ర మీరన్నవిధము ♦ నాదు పుత్రికకైలాస నాథుకొరకు ♦ నేగియుండియు రాదాయెనింతవరకు ♦ యేమికారణమో గాని యెరుగమయ్య ।

నా-వ॥ మేనకా చింతిల్లకుము అట్టి సంతోషవార్తనే మీకెరిగిం చుటకై నేనిందు విచ్చేసితిని పార్వతీ పరమేశ్వరు లదో వచ్చుచున్న వారు చూడుడు.

హి-వ॥ మహాభాగ్యము.

సం-వ॥ అని యిటులనుచున్నంతలో పార్వతీపరమేశ్వరులు వచ్చి యుండుటయు నంత,

వాడం — దర్వు — ఆట.

పా॥ జననీజనకులు నావం । దనమూగైకొనుడీ । ఘనమైన ప్రేమతో ననుదీవించూడీ ॥జ॥

మే॥ రావే ముద్దుల పుత్రీ । రాజీవనేత్రీ । రావే ననుగన్న తల్లీ । రమణీయగాత్రీ ॥ రా ॥

హి॥ పరమేశ విన్నుమా । గిరిజా వరించే । కరమొప్పమా పూర్వ । కర్మ ఫలించే ॥ ప ॥

శం॥ గిరిరాజ మీపుత్రి పరమపవిత్రి । సరస సద్గుణురాలు । చానపవిత్రి । గి ।

నా॥ అనుకున్నట్టులమీకు । నల్లుడుగలిగే । మనసులోపలగల్ల । ఘనచింత దొలిగే ।అ॥

పా॥ మునివర్యమీపాద । ములకూ వందనమూ । వనజాక్షుభక్తీవనలివ్వ ఘనమూ । ము ।

నా॥ అమ్మా పార్వతినీకు । యాశీర్వాదమ్మా । సమ్మతితో నిస్తి । నోమ్మా మోదమ్మా । అ ।

హి॥ అథవ మాగౌరీని । అంగీకరించీ । శుభామాని పెండ్లాడు । విభవంబుహెచ్చి । అ ।

శం॥ పెద్దవారలమాట । వెనుదీయుగలనా । వద్దకొచ్చిన శ్రీని । వదలివేయుదునా । పె ।

మే॥ శుభముహూర్తంబూను । చూడు మాసిందాౖ రభసంబు మీరి పేరట సుగుణసాందా । శు ।

నా॥ ధరణీ గుమ్మడిదాల । ధామూని దలచీ । శరముప్ప దెల్పెది స్థిరబుద్ధి నెంచీ । ధ ।

వ॥ మేనక హిమవంతులారా నేటిదినంబే చాలమంచిగానున్నది. పిల్లను పిల్ల వాన్ని మంగళస్నానంబులు జేయించి సర్వాలంకార భూషితుల గావింపుడు ముహూర్తము దాటిపోవును.

హి॥ సరే అటులే గావించువారము.

సం-వ॥ అవి యిటుల శుభముహూర్తమున పార్వతీ పరమేశ్వరులకు వివాహంబుగావించి రెటులన.

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ । తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ । లక్ష్మీపతే తేంఘ్రి యుగం స్మరామి॥

సం-వ॥ ఇటుల గిరిజా శంకరుల వివాహము జరుగుచుండగా దివినుండి సురలు పుష్పవృష్టిని గురిపించిరి దేవ దుందుభులు మ్రోగెను యనంతరమా పురాణ దంపతులు అన్యోన్యాను రాగంబున చిరకాలము సురతక్రీడల దేలియాడుచుండుటయు, నంత నక్కడ దేవేంద్రుండు.

ఇం-వ॥ మాతలీ సూ: తారకాసురుని బాధలు లావగుచుండెను నేనేమిసేయుదుదు.

యింద్రుని - దరువు - అటు.

ఏమిసేతూ । మాతలి నేను । యెట్లాసేతూ । కామకుండు తారకాసురుని బాధల ॥కే॥ - నవ్వాని । దునుమాడెడు । వానిపూని ॥ యేనాడు శంభుండు తాను గనునో కాని । యే । తమిర్మామాలి । మాటలు నేను । నమ్మాక్రోని । నిమ్మలంబుగనుండ నేటికిట్టులనాయె । నే । వసుధాలోనా । గుమ్మడిదాల । వానుడైనా । బిసరుహాక్షు సఖుసి ప్రేమనాపై లేదో । యే ।

సం-వ॥ అని యిటుల సురనాథుండు దుఃఖించు చున్నంతలో నారదుండరుదెంచినం జూచి.

ఇం॥ మహేంద్రా నమస్కారములు.

నా-వ॥ ఇంద్రా విజయోస్తు.

ఇం-వ॥ ఎక్కడి విజయము నారదా.

చం॥ హరునకు పెండ్లి యాయెజగ । దంబగు పుత్రుడు బుట్టడాయె దు
శ్చరితుడు తారకాసురుడు । సల్పెడు బాధలు ఘోరమాయె మా
యిరవులు దూరమాయె తల । లెత్తిచరింప భయంబులాయె నీ
కరణిని యెన్నినాళ్లనుచు । కాలము బుచ్చెదు మయ్య నారదా ।

వాడం - దరువు - అట

ఇం॥ మునివరేణ్యా । ఘనతరపుణ్యా ॥ము॥ వినగజేయుమియెన్ని నాళ్ళ । విధము గడుపుదు నేనికా ॥ము॥

నా॥ యెందుకింతా । నీమదిచింతా ॥యెం॥ తొందరొందగ బోకు విజయము । నందగల్గావు నీవికా ॥యె॥

ఇం॥ శివునిసుతుడూ । జన్మించునపుడూ ॥శి॥ దవిలియుద్ధము జేసి దైత్యుని । ధరణి గూల్చెదెప్పుడూ ॥శి॥

నా॥ హరుడుతామా । గిరిజతోనూ ॥హ॥ సురుతరానందంబు నొందుచు । మరచె లోకములన్నియూ ॥హ॥

ఇం॥ యిందుకొరకూ । యేదైన నాకూ ॥యిం॥ సంధిదెలిపియు కరుణతోనా । బంధముల నొదిలించుమా ॥యిం॥

నా॥ సురవరేణ్యా । శూరాగ్రగణ్యా ॥సు॥ సురమునులబిలిపించు శంకరు కొరకు నాలోచించెదా ॥సు॥

ఇం॥ సరెనీమాటా । వరహాలమూటా ॥స॥ యరమరేలను సురల మునులను । సరగునను బిలిపించెదా ॥స॥

వా॥ తడవదేలా ! ధవళశీలా ॥ త ॥ వుడమి గుమ్మడిదాలపారీ । యుడుపతీ ధరుడేలునా ॥ త ॥

సం_వ॥ అని యాదేవేంద్రుడు దేవతల నంపరిని బిలిపించి సభ నొనర్చి ఈశ్వరుడేమి జేయుచున్నది చూచిరమ్మనగా నందులకు నెవరును ధైర్యముతో బియ్యకొనకుండిరి యెందుకనగా శివుడు మహాకోపిష్టి తనఫాలనేత్రాగ్నితో మన్మధుని భస్మముజేసినట్లు తమను గావించునని భయపడిరి. తుదకు దేవేంద్రుడు అగ్నిదేవుని ప్రార్థించి పంపగా నాతడు వచ్చి పార్వతీపరమేశ్వరులొక యేకాంత మందిరంబున రతిక్రీడలందేలి యాడుచుండుట గవాక్షముగుండా జూచుచుండెను. అంత పార్వతీదేవి పరమేశ్వరునితో నాథా ! యెవరో దుర్మార్గుడడుగొంచి మన గుట్టెల్ల దెలియుచున్నాడని విన్నవింప, ఈశ్వరుడప్పుడు తన వీర్యమును బట్టి యా అగ్నిహోత్రుని నోటిలో బోయుటయు, నంత అగ్నిహోత్రుడు ధరింపలేక నటనుండి బైలుదేరి నొక నదియొద్దనకువచ్చి యా శంకర వీర్యమును వెడలగ్రక్కి పోయెను. నంత యా వీర్యమునుండి అగ్నిజ్వాలలు వెడలుచుండెను, అటుపిమ్మట సప్తఋషుల భార్యలు నీటికొరకచ్చటికి వచ్చి అది గ్రీష్మఋతువగుటచే చలియొక్క బాధకు తాళజాలక యా యగ్నిని గావుకొనదలచిరి కాని అరుంధతియను నాపె యగ్నిపర పురుషుడు గావున పతివ్రతలకు కావుకొన తగదని పోయెను. మిగిలిన యారుగ్వురా యగ్ని కాచుకొనిరి. దాని మహాత్మ్యమున వారికి గర్భము నిలచి వెంటనే ఆరుగురు ఆరుగురి కొడుకులంగనిరి. అట్లు ప్రసవించిన పుత్రులంజూచి వారు దిగులుపడి యా బాలకుల నచ్చటనే వదలి తమ తమ నివాసంబుల కేగిరి ఇట్లుండ నప్పుడే పార్వతీ పరమేశ్వరులు విహరించుచు యా నదియొద్దకు వచ్చిరి. వచ్చినతోడనే పార్వతీదేవి యా బాలకులంజూచి మమకారముతో నాయార్గురు బాలకుల నొకేసారి యెత్తుకొని యెదకు హత్తుకొనగా, నా యార్గురు బాలకులొకే బాలుడాయెను అదిగని మిగుల సంతోషంబున పార్వతీ పరమేశ్వరులా బాలునకు షణ్ముఖుండని పేరుబెట్టి ముద్దుమురిపెంబులతో బోషించుచుండిరి ఇట్లుండ నొకనాడు.

—( షణ్ముఖస్వామి రాకడ )—

కం॥ హారగిరిజా వరపుత్రుడ ♦ మరుశత రూపుండ సకల మానివినతుడన్
వరభుజ బలభీకరుడను ♦ శరహాస్తుడ వినరనేను షణ్ముఖుడనురా ॥

మాటలు॥ ఒరేఒరే పార్వతీ పరమేశ్వరులకు ప్రియపుత్రుండను సౌందర్య గాత్రుండను, సకలశాస్త్ర పారంగుడను, యుద్ధ కళా నిపుణుండను. అరివీర భయంకరుండను మన్నామంబు షణ్ముఖుం డందురువారీ సూత్రధారీ. దర్వు – రూపకం.

హార గిరిజా వరపుత్రుడ । మరుసమ సుందర గాత్రుడ । వరభుజ బలభీకరుడను । సురమునిగణ వినుతుడరా । హా । సమరాంగణ విజయుండను । రమణీయ చరిత్రుడరా । విమల హృదయుడను సుజనుల క్రమముతో రక్షించెదరా । హా । సకలకళా నిపుణుండను । సుకవిజన స్తుతుడనురా । పరికటిత విజ్ఞానుడనే । నకలంక హృదయుడనురా హా॥ శతృతిమిర మార్తాండుడ । గోత్రసుధీరుడ వినరా । ధాత్రిని సుమ్మడి దాల తి । నేతృసి గొనియాడెదరా ॥హా॥

సం–వ॥ అని యిటులనుచున్నంతలో దేవేంద్రుడరుదెంచి యేమను చున్నాడన.

ఇం–క॥ వందనము యభవపుత్రా ♦ వందనము సురాళిమిత్ర వైరివిజైత్రా ♦ వందనము శుభచరిత్రా ♦ వందనములు జేయుచుంటి వాసవుడనునే ॥

ష–వ॥ దేవేంద్రా నీకు నీవారికి శుభమేకదా.

ఇం–వ॥ యెక్కడి శుభము స్వామీ.

వాదం – దర్వు – ఆది.

ఇం॥ యేమనీ వచియింతు నీతోనూ । మృత్యుంజయసుత నే ॥నే॥ కామకుడు దుర్గుణుడు తార । కాసురుడు బలవంతిమున సుర । ధామమును గైకొనియు మమ్ముల । తామసంబున దరిమి వైచెను ॥యే॥

ష॥ అయ్యయో మీకెట్టియాపదలూ । ఘటిలెతోచదు ॥అ॥ యియ్యెడను దిక్పతులుమీరలు । యేకమై దానవుని బట్టి । కయ్యమున నోడించి స్వర్గము । గైకొనియు సుఖముండవలదా ॥అ॥

ఇం॥ వనజ భవునీ వరములచేవాడూ । గర్వించుచుండెను ॥ వ ॥

ఘనభుజ బలుడు కఠిన చిత్తుడు । కదనమందున వానిగెల్చుట । కును వశంబునుగాక మేమిటు । వనములో తలదాచుకొంటిమి ॥వ॥

వ॥ యేమి యాలోచనలు జేసితిరి । సురలెల్ల మీరలు ॥ యే ॥ నామదికి నినుజూచినంతలో । నేమొ జాలియు గల్గుచుండెను । యో మహేంద్రా దెల్పుమిక నీ । క్షేమమెప్పుడు గోరువాడను ॥యే॥

ఇం॥ దిక్కునీవని నమ్మియుంటిమీ । మా దేవతిలకమా ॥ది॥ అక్కరతో నీచక్కజేరియు మ్రొక్కవేడితి నీవుగాకను । రొక్కరెవ్వరు దానవునితో నిక్కపోరగ జాలనోపరు ॥ది॥

వ॥ మంతనంబున చింతనొందకుమా । దేవేంద్ర నీవిటు ॥మం॥ యింతలో దనుజాధమునినే । వంతుబాపియు సురమునులకును । సంతసంబొనరింతు నిజమిది । కంతుసంహారు నాశ్శిగాను ॥మం॥

ఇం॥ చాల సంతసమాయె నామదికి । నీవన్న మాటకు ॥ చా ॥ మేలువోచెను ధరణి గుమ్మడిదాల నాసుల బ్రోచువాడగు । కాలకంఠుని తనయ నీడగు । కరుణయింతని బొగుడ తరమా ॥చా॥

షణ్ము — కందార్థము — ఆట

సురనాథ వినుమి తెల్పెద ♦ సరగున భటునంపిసురల జతగూర్పుమిక ♦ వరభుజ బలమున యానిశి ♦ చరులను దునుమాడవలయు ॥ శౌర్యంబుతోడ ♦ విడువకమహా ♦ ధైర్యంబుతోడ ♦ కరమొప్ప తారకాసురుడైతె నావంతు ♦ దురుసూగ మిగత దైత్యుల ద్రుంచమీవంతు ॥

ఇంద్రు — కందార్థము — ఆట.

అటులైతె నామనస్సుకు । దిటమాయెను త్వరితముగను । దేవసమూహం । బిటకేగుదెంచునట్టుల । తటకున జెప్పింపెదాను ॥ దైత్యులతోడా । యుద్ధముజేయు । దగును యోప్రోడా । కుటిల దనుజుడు తారకుడు మాయకారుడు । యెటు దున్చెదవోక । పటుధైర్యమొప్పగ ॥

వాదం — దర్వు — ఏక.

వ॥ భయమునొందకు మిందా్రి । వదువమిక గుణసాంద్రా ॥ భ॥ నయముగ దానవులనెల్ల । రయమొనరించియు॥జయముగాం చేదాను ॥

ఇం॥ మీనకేతన రూపా । యున । మానశౌర్యప్రతాపా ॥మీ॥ దీనుడ నాదిక్కునీవె । మేనకాత్మజతనయ । మేటిశూరుడవయ్యా ॥మీ॥

వ॥ పట్టువిడువకాను । మహా । అట్టహాసముతోను ॥వ॥ గట్టిగ

యా తారకున్ని । పట్టి చెండాడెద । బవరంబులోపల ।వ।

ఇం। వనజభవుని మాటా నిజ । మనిదోచె నీమాటా ।వ। మనమున ధైర్యంబుగలిగె । యినతేజనీమాట విన్నంతలోపల ।వ।

వ। తడవుజేయకుమింకా । ది । కతలములెల్ల వడకా ।త। కదువడి దండెత్తి మనము । వెడలవలయు మది । జడియాక నిప్పూడె ।త।

ఇం। మేరుగోత్రిధీరా । యడి । వీర గర్వవిదూరా ।మే। యీనితిగ వెడలుదాము । ధారుణి గుమ్మడిపాల యీశునిదలచి ।మే।

సం-వ। అని ఈ ప్రకారముగా కుమారస్వామి త్రిదశులను వెంట నిడుకొని యుద్ధ సన్నద్ధుడై బైలుదేరి తారకాసురునిపై దండెత్తి వచ్చి నంజూచి తారకుండు తన రాక్షసబలంబునెల్ల వెంటనిడుకొని వచ్చి కుమారస్వామింజూచి యేమనుచున్నాడన.

తా-కం। ఓరీ షణ్ముఖనీవిటు । క్రూరుల దేవతలనెల్ల గూడియు రాగా । తారకుడు భీతిజెందున । రారా రణమందునిన్ను రయమొ నరింతున్ ।

వాదం - దర్వు - చెల్లి.

ష। క్రూరచిత్త నీనోరుమూయు త్రివు । రారి నుతుండని యెరుగుమురా । ఘోరాస్త్రంబున నీదు శిరంబును । ధారుణి గూల్చెద చూడుమురా ।క్రూ।

తా। పోరపోర పోరడవుర నాతో । ఐగకుమాటలిటు బల్కకురా । గారడమాడెద నిన్నీక్షణమున । కదలకుండ నిలునిలువుమురా ।

ష। పోతరించి నాతోనిటు దున్న । పోతువలెను మాట్లాడకురా । పాతకుండనిను ఘాతజేయుగను । నీతీరున జన్మించితిరా ।

తా। వ్రేలెడంతలేవుర చూచితెనీ । ప్రేలుడెల్ల నేగంటినిరా । కాలరాచెదను నిన్నుబట్టి లయ । కాలుడనై నేనుంటినిరా ।

ష। పెక్కుమాట లింకేలధనస్సును । యెక్కుబెట్టితిని చూడుమురా । నిక్కబోకు నినుకుక్కపిల్లవలె । స్రుక్కడంచి పెంపెక్కెదరా ।

తా। బల్లిదుండవా నిలువునీదు బల । మెల్లగంటిపోనివ్వనురా । వల్లివిధమునను నలిపివై చెదను । తల్లిదండ్రులను దల్వుమురా ।

ష। మొండిదైత్య కూష్మాండపోయియా । కుండలీంద్ర హారుడుగనరా । దండిశరము నీ గుండెనాటకో । దండమెత్తి నేపడచితిరా ।

తార - సుగంధివృత్తము

ఓరి యర్భకుండవంచు । నూరకున్న చోనరుల్ । మీరిమీరి నేన గొప్ప । మేటినంచు గూయుచుల్ । పూరిపుడ్కవంటి బాణ । మూలు బూనివేసెదా । పారిపోర లేకయున్న । ప్రాణములు బాసెదా ।

సం-వ। అనిన కోపోద్దీప్తుండై షణ్ముఖస్వామి యేమనుచున్నాడన.

షణ్ము - సుగంధివృత్తము

పారిపోవు వాడగాను పాపకారినిన్నికల్ । పోరులోన జిక్కబట్టి బొబ్బరిల్ల దిక్కులున్ । ఘోరసాయకంబులాను గూలనైతు నీతలల్ । నారెనారెకూను నన్ను సన్నుతింప దేవతల్ ।

వాదం - దస్వు - ఏక.

తా। బాలక నాతోడను పగ । యేలనునీకూ । నాజోలికిరాకూ । యమకూలతజేడకూ । పాలుమాలి నాతో బవరంబుజేసిన । మేలు గాదు ప్రాణజాలంబు నొదిలేవు । యేలరనీకూ । సంద । పాలునుగాకూ । సుర । జాలముకోరకూ ।బా।

ష। నిక్కి నీల్గబోకుము నీ । దిక్కెవండురా । బలు । రక్కసి వినరా । నీ । పక్కదెలిసెరా । గ్రక్కున నిన్నదె । నొక్క బాణంబూను । యెక్కుబెట్టినిన్ను । సృక్కడంచెదనాకు । మ్రొక్కనవినరా । నీవు । దక్కబోవురా । యిది । నిక్కమువినరా ।ని।

తా। వట్టిమాటలు వదరకు నీ । గుట్టుదెలసెరా । నా । దిట్టత గనరా । నిను । మట్టుబెట్టెదరా । గట్టిగనీయొక్క కాళ్లుజేతులుబట్టి । కట్టెపుల్లలరీతి । పుట్టుపుట్టనగాను । అట్టెవిరచెదరా । నీ । పొట్ట జీల్చెదరా । బుక్క । బెట్టెదానురా ।వ।

ష। మదమెక్కిన మాటలింకా । వదలవేమిరా । నిను । వదలలేనురా । నా । మది జెడరేనురా । కుదురుగాగ నాయొక్క పదను యమ్ములనూ నీ । యెదలోన గురిబెట్టి వదలాకవిడచీతి । కదలకుండుమురా । దు । ర్మదుడవుగదరా । పా । రెదవెచటికిరా ।మ।

తా। అన్నమిన్న దెలియకమా । ట్లాడబోకుమురా । నీ । వన్నె బాపెదరా । నీకున్న వారినిరా । బిల్వు । కున్న వెందుకురా । కన్నుగానని దుష్టగర్వపోతనీవు । పన్నాగనాయొక్క పదనుఖడ్గంబూన । మున్నుయిట్టెవ్వరా । వల । దన్న బోరెవురా । పా । ప్మన్న వినవురా ।అ।

 26-5-75.

వ॥ వారి వీరి వలెను నన్ను । దూరబోకుమురా । నా । శూరత
గనరా । జల్ । ధీరుడవినరా । ధారుణి గుమ్మడిదాల వాసుడుమెచ్చ ।
నారాయణాస్త్రంబు । నారెకు మంత్రించి । జారవిడచితిరా । నిన్ను ।
మారబుచ్చునురా । తప్పు । నేరదురా ॥వా॥

సం-వ॥ అని యిటుల కుమారస్వామి ప్రయోగించిన నారాయ
ణాస్త్రంబు తారకాసురుని సంహరించుటయు నంత దేవతలు పుష్ప
వృష్టిని గురుపించిరి సుమముని గణంబులు సంతోషించిరి అట్టిసంతోష
సమయంబున దేవేంద్రుని స్వర్గసింహాసనంబున గూర్చుండబెట్టి పట్టాభి
షేక మహోత్సవము గావించి యట్టి జగన్నియామకులగు పార్వతీ పర
మేశ్వరుల పేరట మంగళ గీతములు బాడిరెటులన.

మంగళహారతి

మంగళములు పార్వతిలోలా । జయ । మంగళములు కీరివిశాలా ।
అంగజారి ధవళాంగ మహేశ్వర । గంగాధర శివలింగ మహాప్రభో ।
మం॥ బాల చంద్రసేఖర దేవ । శరు । ణాలవాల సద్గుణభావా । నీల
లోహితవి శాలవక్షుముని । పాలజయావహా కాలగర్వహర । మం ।
దీనజనావన భూతేశా । అ । జ్ఞాన తిమిరభాస్కర యీశా । మాన
నీయ యనమాన దయాపర । దానవ వంశమదావహరణశుభ । మం ।
మారకోటి సుందరగాత్రా । సువి । చారతత్పరా సుచరిత్రా । ధారుణి
గుమ్మడి దాలలో వెలసిన । మేరుధీరఫణి । హారనీకుశుభ ।మంగళ।

ఫలశ్రుతి

క౦॥ ఈకథ విన్నను చదివిన ♦ ప్రాకటముగ నాడియున్న భక్తులకెల్లన్
లోకాధీశుడు యీశుడు ♦ సాకల్యంబుగ నొసంగు సర్వశుభంబుల్ ।

గద్య

ఇది శ్రీ వైశ్యకుల పారావార సుధాకర పునిగెశెల గోత్రోద్భవ
చెర్విరాల వంశ ప్రదీపక వీరన్న రాజమాంబా గర్భ
తనూభవ కవితా వైభవ నానావిధ గ్రంథరచన
ఛంగధేయ భాగయ్యా నామధేయ ప్రణీతం
బైన తారకాసురవధ యక్షగానము
సంపూర్ణము.

కొండా వీరయ్య అండ్ సన్స్‌వారి శ్రీభారతీ ప్రెస్, సికింద్రాబాద్ - ఆం. ప్ర.